

★ దయా! నీ పేరు దయ్యమా? ఓహ్! ఇవి జాగృతిలో వచ్చిన కిరస్తానీ కీలకాలేనా? ఇలాంటివి ఊరూరా జరుగుతున్నాయి. ఈ కథల సంపుటి వస్తుందని తెలిసిన....

**ఓ పరిశీలకుని వేదన.**

★ మా సంఘం హాలులో మీటింగు పెట్టుకొని వెళ్ళిపోయేప్పుడు శ్రీరామ, శ్రీకృష్ణ, స్వామి వివేకానంద, మహాత్మాగాంధీల బొమ్మలు పగలగొట్టిపోయారు.

**-మహబూబాబాద్‌నుండి ఓ పాఠకుడు.**

★ శ్రీశైల మల్లికార్జున స్వామి సందర్శనార్థం వస్తున్న భక్తులకు అడ్డంగా వస్తూ కిరస్తానీ మతమే గొప్పదని చెప్పే కరపత్రాలు పంచుతున్నారు.

**-దారిలో వెళ్లే ఓ యాత్రికుడు.**

★ వేంకటేశ్వరుణ్ణి తలచుకొంటే లక్ష్మీనారాయణశర్మకు రోగం తగ్గని కారణంగా ఆయన బొట్టు చెరపేసికొని ఏసును తలచుకొంటున్నాడని మా ఊళ్లో ప్రచారం చేస్తున్నారు.

**-అమలాపురం నుండి ఓ సామాజిక కార్యకర్త.**

★ హిందువుల ఇండ్లల్లో పనిచేసేవారు వారు పెట్టే ప్రసాదాలు తీసుకోరాదని చర్చిలో చెప్తారంటూ అప్పుడప్పుడే మతాంతరీకరణ పొందిన తమ కర్మచారి గురించి సభలో చెప్పిన ఓ కంపెనీ డైరెక్టర్.

**-ఆ నగరంలోని సభలో ఉన్న ఓ ప్రేక్షకుడు.**

★ డప్పులు కొడుతూ వీధి వీధి తిరుగుతూ విగ్రహాలను దూషిస్తూ హైదరాబాదు పరిసరాల్లోని కాలనీల్లో నానాహంగామా చేస్తున్నారు.

**-ఓ కాలనీ నివాసిఫిర్యాదు.**

★ మతం పేరిట మారిపోయి, జాతీయత కోల్పోయి మాతృభూమినే పోగొట్టుకొన్న వారికి మనుగడే దుర్భరమవుతుంది. మతసామ్రాజ్యవాద దురహంకారుల చేతుల్లో బానిసలుగా బ్రతుకాల్సి వస్తుంది.

**-ఓ జాతీయవాది ఆక్రందన.**



# దయా! నీపేరు దయ్యమా?

-కథల సంపుటి

కిరస్తానీ కీలకాల వాస్తవ కథలు



-డా॥ కసిరెడ్డి

# దయా! నీపేరు దయ్యమా?

-కథల సంపుటి

## (కిరస్తానీ కీలకాల వాస్తవకథలు)

-డా॥ కసిరెడ్డి




Regd. No. 250/75

ప్రకాశకులు :

**శ్రీ సి.బి.ఆర్. ప్రసాద్**

జాతీయ సాహిత్య పరిషత్

భాగ్యనగర్‌శాఖ-ఆంధ్రప్రదేశ్

**కసిరెడ్డి సాహితీ త్రింశతి:20**

# దయా! నీ పేరు దయ్యమా?

- కథల సంపుటి

(కిరస్తానీ కీలకాల వాస్తవ కథలు)

-డా॥ కసిరెడ్డి


ప్రథమ ముద్రణ : 2003 నవంబర్

ప్రతులు : 2000

భాగ్యనగర్ జాసాపశాఖ ప్రచురణ సంఖ్య : 78

ప్రకాశకులు:

**సి.బి.ఆర్. ప్రసాద్**

జాతీయ సాహిత్య పరిషత్, భాగ్యనగర్‌శాఖ

నారాయణగూడ, హైదరాబాదు-500 029.

ప్రతులకు:

**సాహిత్య నికేతన్**

3-4-852, బర్కత్‌పుర,

హైదరాబాదు-500027.

ముద్రణ:

**ఓం సాయి గ్రాఫిక్స్**

3-7-709, నారాయణగూడ,

హైదరాబాదు. ఫోన్:27560543.

**మూల్యం: రూ. 30.00**


## సమర్పణ

ప్రజాస్వామ్యభారతంలో తమ సంఖ్య పెంచుకొని, ముమ్ముందు దీనిని తమ మత దేశంగా మార్చాలన్న విదేశీ స్వదేశీ క్రైస్తవ మిషనరీల కుట్రలు-ఆంధ్రప్రదేశ్‌లో వ్యక్తులమీద కుటుంబాల మీద-సమాజంమీద ఎలా ప్రయోగింపబడుతున్నాయో తెలిపే ఈ

'దయా! నీ పేరు దయ్యమా?'

అనే ఈ వాస్తవకథల్ని, మోసానికిగురై మతం మారిన హిందువులకు, మోసాన్ని ఎదిరించి తల్లి ఒడిలోకి వచ్చిన హిందువులకు-

ఆత్మీయతానురాగాలతో సమర్పణం

*స్వభాను సం॥ర మార్గశిరపాద్యమి*

*2003 నవంబర్ 27* ప్రకాశకులు & రచయిత.



# అందరూ చదవాలనే ఈ ప్రచురణ

నేను మాజీ సైనికుణ్ణి, క్రీడాకారుణ్ణి, మా కుటుంబం 50 సం॥ల క్రితం, మతం మార్పిడికి గురయ్యింది; హిందూ ధర్మ సంస్కృతులకు దూరమయింది. చిన్నప్పుడు బైబిల్ చదివాను, చర్చికి వెళ్ళాను. ఉద్యోగంలో చేరిన తర్వాత నా సంపాదనలో 10% చర్చికి పంపిస్తూ వచ్చాను.

అయితే క్రైస్తవం సంకుచిత పథంలో, కుత్సిత ఆలోచనలతో ఇతరులను తమమతంలోకి మార్చే పైశాచిక కృత్యాలు నిర్వహిస్తున్నట్లు అర్థమైంది. సైన్సుకు దగ్గరగా లేని ఎన్నో మూఢనమ్మకాలు క్రైస్తవంలో ఉన్నట్లు తెలిసి వచ్చింది. క్రైస్తవుల నయవంచక ప్రకటనలు మోసపూరిత విధానాలు నన్ను దైవభక్తికి దూరంగా విసిరివేశాయి.

ఈ పరిస్థితులలో సైనికజీవితం, వ్యావసాయిక జీవితం, వ్యాపారజీవితం ముగిశాయి. ఆర్.ఎస్.ఎస్. పరివారంలో ఒకటైన సేవా భారతి కార్యక్రమాలు నన్ను ప్రభావితుణ్ణి చేశాయి.

ప్రేమతో, దేశభక్తితో నిర్వహించే ఈ కార్యక్రమాల్లో నిజమైన హిందూసేవా ధర్మంనాకు కనిపించింది.

ఇస్లామిక్ టెర్రరిజం, క్రైస్తవమత దురాగతాలు నిరోధించాలంటే దేశప్రజల్లో భావవిప్లవం రావాలని ఆలోచన కలిగింది. ఈ ఆలోచనలో భాగంగానే ఇది వరకు కొన్ని పుస్తకాలు ప్రచురించి వితరణచేయడం జరిగింది. ఆ దిశలో ఇప్పుడు డా॥కసిరెడ్డి జాగృతిలో వారం వారం ప్రచురించిన కొన్ని కిరస్తానీ కీలకాలను (వాస్తవ కథలను) లోకం ముందుకు తీసుకొని వెళ్లి, ఈ గోముఖ వ్యాఘ్రాల స్వరూపాన్ని బట్టబయలు చేయాలనిపించింది.

ఈ భావ ప్రచారం ద్వారా హిందుత్వాన్ని రక్షించుకొని, హిందువులు బలపడి, విదేశీ సామ్రాజ్యవాద మతశక్తులను ఎదుర్కొని, తమదేశ ధర్మజాతి సంస్కృతుల అస్తిత్వాన్ని నిలుపుకొంటారని ఆశిస్తున్నాను. అంతేగాక హిందుత్వం చెప్పిన సర్వజీవులూ సమానం (ఆత్మవత్సర్వభూతాని) అనే ఆదర్శం గ్రహిస్తారని భావించాను. శాంతి, సౌఖ్యం, దయా, జీవ సేవ తదితర దివ్యభావాలు హిందుత్వం ద్వారానే ప్రపంచం గ్రహించి తమ తమ దేశాలను దివ్యంగా మార్చుకొంటాయని విశ్వసిస్తున్నాను.

ప్రప్రథమంగా ఈ వాస్తవ కథల ద్వారా క్రైస్తవుల మోసాల వలలో పడకుండా హిందువులు నిలదొక్కుకోవాలని కోరుకొంటూ, వారివలల్లో పడ్డవారు హిందుత్వంలోకి మళ్లీ రావాలని ఆహ్వానిస్తూ ఈ కథల ప్రకాశకునిగా దగాపడ్డ నా వారందరికీ పిలుపునిస్తున్నాను. మీరవి చదివి మరో పది మందికి చదివిస్తారని ఆశిస్తున్నాను.

భాగ్యనగర్ — భవదీయ

2003 నవంబర్ 27 — చలసాని బాబురాజేంద్రప్రసాద్.

## ధన్యవాదాలు

హిందూస్థాన్‌ను క్రైస్తవస్థాన్‌గా మార్చాలని క్రైస్తవులు, ఇస్లాంస్థాన్‌గా మార్చాలని మహమ్మదీయులు శరవేగంగా ప్రయత్నం చేస్తున్న ఈ సందర్భంలో వస్తున్న కథల పుస్తకమిది. ఇవన్నీ జరిగినవే అంటున్నారు రచయిత. 1999వ సం॥లో దాదాపాక సంవత్సరం ఈ కథల్ని "కిరస్తానీ కీలకాలు" అనే శీర్షిక క్రింద జాగృతిలో డా॥ కసిరెడ్డిగారు ఇవి వ్రాశారు.

30 సం॥రాలుగావారు ఎన్నో వ్రాశారు. అందుకు గుర్తుగా 30 పుస్తకాలు ప్రచురించాలనుకొన్నాం. అందులో ఇది 20వ పుస్తకం. త్వరలో మిగతావి కూడా అందించే ప్రయత్నం చేస్తాం. ఈ కథల సంపుటికి పూర్తిగా సహకరించి తామే ప్రకాశకులుగా ఉండి ఎందరికో అందించే ప్రయత్నం చేస్తున్న వారు శ్రీ సి.బి.ఆర్. ప్రసాద్‌గారు, వారికి మా ధన్యవాదాలు.

భాగ్యనగర్ — సంయోజకులు

27.11.2003 — కసిరెడ్డి సాహితీ త్రింశతి

## విషయ సూచిక

★ ★ ★



# 1. నేనెంతమాయలో పడితి!

**భా**గ్యనగర్ పరిసరాల్లో అదో గ్రామం. ఆ గ్రామంలో లక్ష్మారెడ్డి పెద్దరైతు. 76ఏళ్ళ వయస్సు. ఆజానుబాహుడు; కాయకష్టం చేసిన శరీరం. దృఢంగా బలంగా ఉన్న పెద్దమనిషి.

నలుగురితలలో నాలుక. దగ్గరే ఉన్న ద్వారాకామాయి ఆలయం ఆశ్రమంలోని స్వామిజీకి సన్నిహితుడు. గ్రామంలోని దేవాలయంలో ధూపదీప నైవేద్యాలు నిరంతరం జరగాలని దాన-వదాన్యబుద్ధితో జీవిస్తున్న మంచి మనిషి.

కొడుకులూ కూతుళ్లూ ఉన్నారు. అందరూ ఉద్యోగాల్లో ఉన్నారు. అందరి పెళ్లిళ్లయినయి. ఎవరి బాధ్యతలు వారివి. వారు సంవత్సరానికోసారి పండుగకు ఇంటికి వస్తే వచ్చినట్లు - లేకుంటే లేదు.

ఆ ఊళ్లోకి ప్రతి బుధవారం ఓ ఆర్ఎంపి డాక్టర్ ఓ నర్సమ్మ రావడం - ఉచిత చికిత్సలు మొదలు పెట్టడం చూచి ఇదేదో బ్రతుకుతెరువు అనుకొన్నారు. అందరూ ఉచితంగా ఇచ్చే మందులు కదా అని జలుబు వచ్చినా చూపించుకోడం మొదలెట్టారు. ఇద్దరూ మందులిస్తూ ఏసు దయవల్ల మీకు బాగయితది అని ఆశీస్సులూ ఇస్తున్నారు. తాము కిరాయికి తీసుకొన్న గదిలో ఏసుబొమ్మ పెట్టారు. సూదిమందుకు మాత్రం రెండు రూపాయల ఫీజు తీసుకొంటున్నారు. సూదులిస్తున్నారు: మందులిస్తున్నారు. ఏసుబొమ్మకు దండం పెట్టుకొండి బాగవుతుంది అంటున్నారు.

ఓ రోజు లక్ష్మారెడ్డి వారి దగ్గరికి వెళ్లాడు. కాలికేదో పుండయ్యింది. ఆ నర్సమ్మ పుండు కడిగింది; కట్టు గట్టింది. ఇకముందు తాను లక్ష్మారెడ్డి ఇంటికే వచ్చి కట్టు విప్పుతానన్నది; కట్టుగడతానన్నది.

అప్పటి నుండి ఎప్పుడు పడితే అప్పుడే రెడ్డి ఇంటికి వస్తున్నది. కట్లు విప్పుతున్నది; కట్లుగడుతున్నది. కాలునొచ్చినా, కన్నునొచ్చినా, కడుపునొచ్చినా

వత్తుతున్నది, మందు ఇస్తున్నది; మంచి సేవ చేస్తున్నది.

అలా మూడు నెల్లు గడిచాయి. లక్ష్మారెడ్డి రెండుసార్లు సికింద్రాబాదు చర్చికి వెళ్లి వచ్చాడు. ఊరంతా ఆయన కిరస్తానీగా మారారనే పుకారు పుట్టింది. చుట్టు ప్రక్కల గ్రామాలకు ప్రాకింది. ద్వారకమాయి స్వామిజీకి తెలిసింది. గ్రామంలోని దేవాలయ కమిటీ వాళ్లందరూ చర్చలు ప్రారంభించారు. కులం వాళ్లు ముక్కు మీద వేలేసుకొన్నారు. ఈలోగా ఆయన అర ఎకరం చర్చి నిర్మాణానికిస్తున్నట్లు తెలిసింది.

అమ్మ నర్సమ్మ ఎంత పనిచేశావే అనుకొన్నది ఊరంతా! ముప్పయియేళ్ల కిరస్తానీ నర్సమ్మ డెబ్బయి ఆరేళ్ల ముసలోణ్ణి మార్చేసింది! అమ్మ బాబోయ్! వ్యభిచారం చేసి కూడా మతంలోకి మార్చుకోవచ్చున్నమాట! ఊరంతా గుసగుసలు - చర్చలు.

ఓ బుధవారంనాడు ఊళ్లోకి వస్తున్న డాక్టరూ నర్సమ్మల స్కూటర్‌ను నలుగురు యువకులు అడ్డుకొన్నారు. కిక్కురుమనకుండా వాళ్ళు వెనక్కు తిరిగి వెళ్లి పోయారు.

ఊరి యువకులు స్వామీజీని కలిశారు. స్వామిజీ లక్ష్మారెడ్డిని కలిశారు. ఊరి దేవాలయంలో మీటింగు జరిగింది. ఆ మీటింగులో మనం హిందుత్వాన్ని రక్షించుకోవాలని యువకులు ప్రతిజ్ఞ చేశారు. లక్ష్మారెడ్డి తలపై తులసినీళ్లు చల్లారు. నేనెప్పటికీ 'హిందువునే'! నాపుట్టుకను మారుస్తారా! నాతల్లిదండ్రులను మారుస్తారా! నన్ను మోసం చేసిండ్రు! ఎంత పని చేసిండ్రు వాళ్లు' అన్నాడు లక్ష్మారెడ్డి.

"నేనెంత మాయలో పడితి!" అన్నాడు శూన్యంలోకి చూస్తూ డెబ్బయి ఆరేళ్ల లక్ష్మారెడ్డి. అందరికళ్లముందు 'బ్రహ్మ సత్యం - జగన్మిథ్య' అన్న అది శంకరుల బొమ్మ రూపు గట్టింది.

●





# 2. లిల్లి లిల్లే మల్లి మల్లే

కూతురు ఆరవ తరగతి ప్రోగ్రెస్ రిపోర్టు చూచి అయ్యవారు (తండ్రి) విస్తు పోయారు. మార్కులు అన్నిట్లోనూ 90శాతం పైచిలుకే ఉన్నాయి. కాని 'లలిత' లిల్లి ఎలా అయింది. ఆ సంగతే కూతురునడిగాడు.

ప్రభుత్వ స్కూల్లో అయిదవ తరగతి వరకు చదివిన తమ అమ్మాయి, ఆరవతరగతి చదువు నిమిత్తం కిరస్తానీలు నడుపుతున్న మిషనరీ స్కూలులో చేరింది. చేరిన రోజు నుండి అమ్మాయిని లిల్లీ అనే పిలుస్తున్నారట. లలిత పేరు బాగా లేదని తమ తరగతి టీచర్, హెడ్‌మిస్ట్రెస్ నడిగి లిల్లీగా మార్చిందట. లలిత అమాయకంగా చెప్పే వరకు అయ్య వారు ఆ సంవత్సరమంతా తాను ప్రోగ్రెసు రిపోర్టు చూడకపోవడం గుర్తుకు తెచ్చుకొన్నారు. అమ్మాయి ప్రోగ్రెసు కార్డు మీద తల్లి సంతకం తీసుకొని వెళ్లేది నెలనెలా. ఆ తల్లికి ఇంగ్లీషు అక్షరం తెలియదు.

ఈ లలిత ఆరవతరగతిలో స్కూలుఫస్ట్, 7వతరగతిలో ఫస్టిన్ ఫస్ట్, అలా బి.ఎస్‌సి పూర్తయ్యేవరకు అన్నిట్లోనూ ఫస్టిన్‌ఫస్టే.

అమ్మాయి కారు నలుపు; అమ్మాయి మనసు మల్లె తెలుపు; తెలివి సూర్యకాంతి సదృశం. కంఠంలో కోకిల ఉంది. ఆ అమ్మాయితో తరగతి గదుల్లో, పాఠశాల సమావేశాల్లో, సాంస్కృతిక కార్యక్రమాల్లో వందల పర్యాయాలు కిరస్తానీ గీతాలు పాడించారు; ప్రశంసించారు; బహుమానాలిచ్చారు.

బి.ఎస్‌సి టి.సి తీసుకోడానికి అప్లికేషన్ పెట్టుకొంది అమ్మాయి. ప్రిన్సిపాల్ లలితను గదిలోకి పిలిచింది.

"చూడు లిల్లీ! ఇక్కడి నుండి వరుసగా, ఎమ్మెస్సి, పిహెచ్.డి పూర్తయ్యే వరకు మేం నిన్ను చదివిస్తాం. ఆ తర్వాత నిన్ను అమెరికా పంపిస్తాం. నీవో ప్రొఫెసర్‌గా, సైంటిస్టుగా అమెరికాలో స్థిరపడిపోతావ్. నీపేరును బట్టి అందరు నిన్ను క్రిష్టియన్‌గానే భావిస్తారు. కాని నీవు మా మతం తీసుకొన్న సర్టిఫికెట్‌తో వెళ్లాల్సి ఉంటుంది. నీకు మంచి భవిష్యత్తు ఉంటుంది" అన్నది ప్రిన్సిపాల్.

'మానాన్నగారు టి.సి తెచ్చుకొమ్మన్నారు మేడమ్!' అన్నది తలవంచుకొని అమ్మాయి.

'ఆయన ఏం చదివిస్తానంటున్నాడు నిన్ను' అడిగింది ప్రిన్సిపాల్.

'తెలుగు ఎం.ఎ మేడం' అంది సంతోషంతో అమ్మాయి.

'లిల్లిపువ్వును మల్లెపువ్వుగా మారుస్తాడన్నమాట... అహ్హాహ్హాహ్హా, నవ్వింది ప్రిన్సిపాల్.

తాను మల్లెపూవు; తనను వీరుకావాలనే లిల్లిగా మార్చారా! అందుకే తనతో క్రైస్తవ గీతాలు పాడించారా! ఏసుకు మొక్కించారా! ఏసుకథలు చెప్పించారా! ఎన్నో బహుమానాలు తనను లిల్లిగా ఉంచడానికే ఇచ్చారా! ఈ దేశం మల్లి; అమెరికా లిల్లి... నవ్వుకొన్నది అమ్మాయి.

'ఏం ఆలోచిస్తున్నావు లిల్లీ! మీ నాన్నకు మారుతున్న సమాజం గురించి తెలియదు. నిన్ను పిచ్చి తెలుగు పంతులమ్మగా మార్చాలనుకొంటున్నాడు. తెలుగులో ఏముంది; ఇవాల్టి విజ్ఞానానికి తగిన భాష కాదది! లిటరేచర్ అంత ఇష్టంగా ఉంటే ఇంగ్లీషు ఎం.ఎ చేయ్. నీవు బాప్తిస్మం తీసుకో! మిగతాదంతా నేనుచూచుకొంటాను...' మృదువుగా అంది ప్రిన్సిపాల్.

'నాన్నగారు టి.సి తెచ్చుకొమ్మన్నారు మేడమ్...' స్థిరంగా పలికింది అమ్మాయి.

'మొద్దుముండ' కసరుకొంది ప్రిన్సిపాల్; 'ఇచ్చి పారెయ్యండి ముండకు' అని క్లర్కులకాదేశించి చరచరా వెళ్లిపోయింది.

అ అమ్మాయి టీ.సి తీసుకొంది. తెలుగు ఎం.ఎలో చేరింది. ఎం.ఫిల్ చేసింది. సాహిత్య శాస్త్రాల్ని, కావ్యాల్ని, తత్త్వశాస్త్రాల్ని అందినంత మేరకు అధ్యయనం చేసింది. హిందుతాత్త్విక దర్శనాలు మూలభిత్తిక కాగా లలిత కలంపట్టింది. ఇప్పుడు 'జ్వలిత'యై రచనలు చేస్తుంది.





# 3. మానవుడు పాపాత్ముడా?

గిరీంద్రనాథ్ యూనివర్సిటీలో ఆచార్యుడు. ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతాలు, ముఖ్యంగా తత్త్వశాస్త్రానికి సంబంధించిన అంశాలు బాగా అధ్యయనం చేశాడు.

ఎన్ని అధ్యయనం చేస్తే మాత్రమేమిటి! చిన్నపట్టింపు మీద భార్యాభర్తలు గత ఆరు సంవత్సరాలుగా విడి విడిగా ఉంటున్నారు. ఉన్న ఒక్క కొడుకు మంచి చెడ్డలు ఆమెనే చూచుకొంటుంది. ఆ అబ్బాయి రెసిడెన్షియల్ స్కూల్లో చదువుతున్నాడు. పన్నెండు నెలలకు ఆ అబ్బాయికయ్యే వ్యయం గిరీంద్రనాథ్ చెల్లిస్తూనే ఉన్నాడు.

ఒంటరిగా ఉన్న నాథ్ మీద ఒ కిరస్తానీ ఫాదరి కన్ను పడింది. ఓ ఆదివారం నాడు నాథ్ ఉంటున్న యూనివర్సిటీ క్వార్టర్‌కు వచ్చాడు. పరిచయంచేసుకొని వెళ్లిపోయాడు. అలా అయిదారు సార్లు వచ్చాడు. నాథ్ గుణగణాల్ని పొగడుతున్నాడు.

ఆ తర్వాత కొన్ని కర పత్రాలిచ్చాడు. అందులో ప్రాణుల మీద దయచూపించాలని, ప్రభువు దయామయుడని ఉన్నది. చిన్న చిన్న పుస్తికలిచ్చాడు. అందులో ప్రభువు దయవల్ల వారూ వీరూ బాగుపడ్డారని ఉన్నది. ఒకటి రెండు చోట్ల హిందూ పురాణ దేవతల దూషణ పరోక్షంగా ప్రస్తావితమయింది. గిరీంద్రనాథ్ అవి చదివి పక్కకు పెట్టాడు.

ఒక రోజు వచ్చిన ఫాదరి బైబిలిచ్చాడు. అది దాదాపు 500 పుటలున్నది. "మీరింత సాహిత్యం నాకిస్తున్నారు. నేను చిన్న పుస్తకం ఇస్తాను; తీసుకోండి! ఇది అదిత్య హృదయం. నేను రెండురూపాయలకు నిన్ననే రామకృష్ణ మఠంలో కొన్నాను. మీరు నాకిచ్చిన సాహిత్యం విలువ 200రూపాయలన్నా ఉంటుంది. మీరు, మీసంపాదనలో నుండి ఇంత ఖర్చు నాకొరకు చేయడం మంచిది కాదు. నేను నా సంపాదన నుండి మీకు రెండు రూపాయల కానుకే ఇవ్వగలుగుతున్నాను" అన్నాడు గిరీంద్రనాథ్.

"ఆ కానుక కూడా నాకు వలదు లెండి! నేను వేరే మతం వారి పుస్తకం చదువను' ' అంటూ వెళ్లి పోయాడు ఫాదరి. అతని ప్రచార సంస్థ అతనికి పుస్తకాలిస్తుంది; అతనికి పుణ్యానికి వచ్చింది; తనది కష్టఫలం... నవ్వుకొన్నాడు గిరీంద్రనాథ్.

ఆ తర్వాత మరో వారం రోజులకు వచ్చాడు.

"మిమ్మల్ని నేను అమెరికా పంపించే ఏర్పాటు చేస్తాను" అన్నాడు.

"ఇక్కడ నేను మంచి ఉద్యోగంలో ఉన్నాను' అన్నాడు గిరీంద్రనాథ్.

'ఈ సంపాదన ఎంతలెండి! ఈ రూపాయల్లో అక్కడ మీకుజీతం మూడులక్షలైన వస్తుంది.' అన్నాడు ఫాదరి.

'నేను విదేశాలకు వెళ్లదలచుకోలేదు' అన్నాడు గిరీంద్రనాథ్.

'మనము ప్రార్థన చేయుదమా" అన్నాడు ఫాదరి?

'చేయుదము' అన్నాడు గిరీంద్రనాథ్

'ఓ దేవా! నీవు ఉత్తముండవు! నేను పాతకుండను!...'

'నేను కూడా ఉత్తముండనే పాతకుండను కాను...' అన్నాడు గిరీంద్రనాథ్.

'మానవులందరు పాపులే' అన్నాడు ఫాదరి.

'మానవుడు అమృత పుత్రుడని ఉపనిషత్తులంటున్నవి. 1893 చికాగో మతమహాసభలో స్వామి వివేకానందుడు మానవుణ్ణి ఎవడు పాపి అని పిలుస్తాడో అతడే పాపాత్ముడని చెప్పారు.... గుర్తుకు తెచ్చుకొండి!' అన్నాడు గిరీంద్రనాథ్.

ఆ తర్వాత ఫాదరీ మరొక ప్రార్థన చెప్పాడు; గిరీంద్రనాథ్ చదివాడు. ఇప్పుడు నేనొకటి చెబుతాను మీరు చదవండి అన్నాడు గిరీంద్రనాథ్. ఫాదరి తలఊపాడు.

"ఓం శుక్లాంబరధరం...' అంటూ శ్లోకమంతా చదివాడు గిరీంద్రనాథ్. ఫాదరి చదువలేదు. తాను మరొక మతం ప్రార్థన చదువనన్నాడు ఫాదరి.

'హిందువుకూ, క్రిష్టియన్‌కు ఉన్న తేడా ఇదే. గెటవుట్.." అరిచాడు గిరీంద్రనాథ్. ఫాదరి తడబడుతూ అటూ ఇటూ చూస్తూ పారిపోయాడు.



# 4. బొమ్మను నమ్ముకోండి!

స్నానంచేసి వచ్చి ఇంట్లోని పూజాగృహంలో కాలుబెట్టి దేవతా విగ్రహాల ముందు, పటాలముందు నిలబడి అక్కడున్న కుంకుమ తీసుకొని నొసలు దిద్దుకొంటూ, ఆపటాల వైపు చూచి 'డంగై' నిలబడి పోయాడు రెడ్డి. తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. హిందూ దేవతా చిత్రాల మధ్య శిలువ వేయబడ్డ క్రీస్తు.

ఈ బొమ్మ వీటి మధ్య ఎలాచోటు చేసుకొంది. ఆయనకు అర్థం కాలేదు.

తాను సీతారామాంజనేయస్వామి దేవాలయం ట్రస్టు బోర్డు ఛైర్మెన్. తన భార్య మహిళా మండలికి పెద్ద. కొడుకు డాక్టర్, కోడలు డాక్టర్. ఇద్దరూ అమెరికాలో ఉన్నారు. మనుమడూ మనుమరాలును చూచుకొంటూ, పూర్వపద్ధతిలో ఉన్న తన ప్రయివేటు ఆస్పత్రి నడుపుకొంటూ, సమాజంలో హిందుత్వ జాగృతికి కృషి చేస్తున్న కుటుంబం తనది.

నిష్ఠతో నిత్యనైమిత్తిక కార్యక్రమాలు నిర్వహించడం, పండుగలు సామూహికంగా నిర్వహించడం, హరికథలూ పురాణాలూ పర్వదినాల్లో చెప్పించడం, ఉత్సవాల సందర్భంగా జలదానం, అన్నదానం, ప్రసాద వితరణం వంటి అనేక కార్యక్రమాలను సేవా దృష్టితో ఇలా అన్నీ హిందూచైతన్య దృష్టితో చేయడం తనకు ఒంటబట్టిన విద్య. అటువంటి తన ఇంటిలోని పూజా గృహంలో ఏసుబొమ్మ.

ఆయన మెల్లగా పూజా గృహంలో నుండి వెలుపలికి వచ్చాడు. భార్యవంటగది నుండి ఫలాహారం తెచ్చి బల్లమీద పెడుతుంది. అక్కడ కూచున్నాడు. "మన దేవుళ్ల ఫోటోల మధ్య ఏసుబొమ్మ ఎలా చేరింది.. ఆయన తనలో తానే గొణిగాడు' ' "అందరి దేవుళ్లతో పాటే ఏసుకూడా" అన్నదామె.

'సంతోషం.. నేను దానికి ఏమనడం లేదు. అది ఎక్కడి నుండో ఇక్కడికి రావడానికి జరిగిన తతంగమేమిటో! అది తెలుసుకోవాలనే' అన్నాడు శ్రీరెడ్డి. ఆ తర్వాత తెలిసిన కథ ఇది?

"శ్రీరెడ్డి ఆస్పత్రిలో ఉన్నప్పుడు వచ్చిపోయే ఇద్దరు మహిళలు వారి శ్రీమతి రాజమ్మకు సన్నిహితులయ్యారు. శ్రీమతిరాజమ్మ గత రెండు సంవత్సరాలుగా కడుపు నొప్పితో బాధపడుతున్నది. భర్త డాక్టర్, అలోపతి, ఆయుర్వేదం, హోమియో, ప్రకృతి చికిత్స.. అన్ని రకాల వైద్యాలు జరిగినై. అయినా కడుపునొప్పి తగ్గలేదు.

గత మూడు నాలుగు మాసాలుగా వస్తున్న ఈ ఇద్దరు మహిళలు కొన్ని మందులిచ్చారు. ఏసును రోజూ ప్రార్థన చేయుమన్నారు. తమకు కూడా కడుపునొప్పి ఉండేదని, తాము ఈ మందే వాడామనీ, తగ్గిందనీ, అయితే ఏసుబొమ్మను ముందు పెట్టుకొని రోజూ ప్రార్థన చేయాలని వారుకోరారు. అప్పటి నుండి శ్రీమతి రాజమ్మ ఆపటాన్ని (శిలువబొమ్మను) అన్ని పటాల మధ్య చేర్చింది. నిష్ఠగా వారిచ్చిన మందులువేసుకొంటున్నది. రోజూ ప్రార్థిస్తున్నది.

ఆమెకు రెండు మాసాలక్రితమే కడుపు నొప్పి తగ్గింది. వారప్పుడప్పుడు వస్తూనే ఉన్నారు. రాజమ్మకు కరపత్రాలు, పుస్తికలు, బైబిలు తదితర గ్రంథాలు ఇస్తున్నారు. అనేక పర్యాయాలు రాజమ్మను, తమ మధ్యకూచోబెట్టుకొని ప్రార్థనలు చేశారు. రాజమ్మకు ప్రార్థన గీతాలు ఎలా పాడాలో నేర్పారు. ఇప్పుడేమో మెల్లగా మతం పుచ్చుకొమ్మని ఒత్తిడి చేస్తున్నారు.

అప్పుడప్పుడు రాజమ్మవారికి భోజనం పెట్టేది. వారు ఇంట్లో తిరుగుతూ, తింటూ ఆ సంగతీ ఈ సంగతీ చెబుతూ భారత దేశంలోని అందరూ క్రైస్తవులుగా మారిపోతారని, మిగతా దేవతల గుళ్లల్లో కూడా క్రీస్తు విగ్రహమే పెడతారని చెప్పేవారు. అందుకే మీరు మారాలనే వారు. మీరుమారితే మీవారు మారతారని చెవులు కొరికే వారు."

ఈ సంగతులన్ని డా॥ రెడ్డికి భార్యవల్ల తెలిశాయి. వాళ్లిచ్చిన మందులు చూపించుమన్నాడు. అవన్నీ గోళీలే. వేటి మీద అవి ఏంగోళీలో తెలుసుకోడానకి ఉండే కవర్‌లేదు. డా॥రెడ్డి వాటిని పరీక్షకు పంపించాడు. అవి చాలా పెద్ద కంపెనీల టాబ్లెట్స్ అనీ, ఒక్కొక్క టాబ్లెట్ ఇరవైరూపాయలపైన్నే ఉంటుందని తేలింది. తన భార్య కడుపు నొప్పి ఎలా తగ్గిందో తెలిసింది. తానేమో తాలూకా కేంద్రంలో ఉన్న డాక్టర్. అందువల్ల అలాంటి గోళీలను తెప్పించలేకపోయాడు. సిటీలో తనకు



తెలిసిన డాక్టర్లు కూడా అవి సజెస్ట్ చేయలేదు. కిరస్తానీ ప్రచారికలకు ఇంత స్ట్రాంగ్ మందులందించిన కిరస్తానీ డాక్టరెవరు! ఆమందుకు మతాన్ని కలిపి వారు సాధించాలనుకొన్నవి సాధిస్తున్నారు. మనుషులను మార్చడమే వారు చేయాలనుకొన్నది; మనుషులు మారితే చాలు వారాశించినట్లు ఈ దేశం ఇటలీకో, ఏ బ్రిటన్‌కో, ఏ అమెరికాకో బానిస దేశమవుతుంది!

ఈ విషయాలన్నీ భార్య రాజమ్మకు నచ్చజెప్పారు. "మందులేక పుండు మాటల మానునా" అన్నది సత్యమే, అయినా వెనుక మతాంతరీకరణ భూతం ఉన్నదని తెలిసే వరకు రాజమ్మకూ ఆగ్రహం కలిగింది.

ఆమరుసటి రోజే వచ్చిన వారిద్దరి ముందు రెండు హిందూ దేవతా చిత్రాలను తెచ్చిపెట్టింది. వీటికి మీరు మొక్కితే నేను ఏసుకు మొక్కుతానన్నది. వారు మొక్కలేదు. "పోనీ! ఈ రెండు దేవతల పక్కన ఏసు చిత్రం పెడుతున్నాను. ఇప్పుడు ఈ మూడింటికి మొక్కండి" అన్నది రాజమ్మ. వారు మొక్కలేదు.

"ఏదేశంలో పుట్టారో, ఏ దేశం సొమ్ము తింటున్నారో ఏదేశ మతాన్ని ఇక్కడ ప్రచారం చేస్తున్నారో గుర్తుపెట్టుకోండి! నా తల్లిదండ్రుల పేర్లు కూడా మార్చుకొనే నీచస్థితికి నేను దిగజారలేదు. ఇదిగో ఈ బొమ్మను తీసుకొని వెళ్లండి! నమస్కారం!' అంది రాజమ్మ.

వారు బిత్తరపోయారు; బొమ్మ పట్టుకొని బొమ్మల్లా వెళ్లిపోయారు.



# 5. దయ్యం పట్టదురా!

అనిల్ రెండో తరగతి అబ్బాయి. తల్లిదండ్రులు భాగ్యనగర్లోనే కాయకష్టంజేసి సంసారాన్ని నెట్టుకు వస్తున్నారు. పెద్దమ్మాయి పెళ్లిజేశారు. ఈ అబ్బాయి చదువుకొరకు పాటుబడుతున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో నగరాల్లో జీవిస్తున్నవారిలో నూటికి 60%మంది తమ పిల్లలను ఇంగ్లీషు మీడియంలో చదివిస్తున్నారు. ఇంగ్లీషు చదువే ఇవాళ అక్షరాస్యతకు గీటురాయిగా నిలిచిందనేది వాస్తవం. ఈ పాఠశాలల్లో 25% క్రిష్టియన్స్ స్థాపించినవి ఉన్నాయి. మరో 25% హిందువులే స్థాపించినా సెయింట్ (సన్యాసి) ఆండ్రూస్, సెయింట్ డామ్నిక్ తదితరుల పేర్లతో నడుస్తుంటాయి. ఇంకో 50% హిందూ నామాలతో (అరవింద, భారతి, అనుపమ, ఆదర్శ, ప్రగతి, శ్రీవాణి, శ్రీవిద్య, వివేకానంద, దయానంద, ఆర్యవిద్యా, ఎల్లయ్య, పుల్లయ్య.... పేర్లలో ఇలా ఎన్నో) నడుస్తుంటాయి.

క్రిష్టియన్ మిషనరీస్ నడిపే పాఠశాలల్లో, మిషనరీస్ కాక క్రిష్టియన్లే స్వతంత్రంగా-వ్యక్తిగతంగా నడిపే పాఠశాలల్లో కూడా 90% హిందూ విద్యార్థినీ విద్యార్థులే చదువుతుంటారు. వీరిని బొట్టు పెట్టుకోనివ్వరు. అమ్మాయిలను కాటుక పెట్టుకోనివ్వరు. తెలుగువారి లంగా వోణీలు ధరించనివ్వరు. అమ్మాయిలను గాజులు పూలు పెట్టుకోనివ్వరు. హిందుత్వ విషయం వచ్చినప్పుడు విషం కక్కుతారు; వ్యతిరేక ప్రచారం చేస్తారు.

డొనేషన్ లేకుండా ఏ హిందూ విద్యార్థికి అడ్మిషన్‌దొరకదు. నెలనెలా భారీ ఫీజులు వసూలు చేస్తారు. సీట్లు ఇచ్చేప్పుడు వాళ్ల తల్లిదండ్రులు ఏకులాలకు చెందిన వారో తెలుసుకొని ఇస్తారు. ఫీజు కట్టగలిగే ఆర్థిక స్తోమత ఉందాలేదా అని పరిశీలిస్తారు. సంవత్సరంలో రెండు మూడు పర్యాయాలు వివిధ సేవా సంస్థల నిమిత్తం విద్యార్థులకు కార్డులిచ్చి వాటి ద్వారా విరాళాలు వసూలు చేయిస్తారు. ఇవిపోగా అప్పుడప్పుడు కిరస్తానీ మతం గొప్పతనం తెలిపే (ఇతరుల రాజ్యాలను ఆక్రమించుకొన్న విషయాలు కావండి! భగత్సింగ్ లాంటి వాళ్లను ఉరిదీసిన సంగతులుండవండి! అమెరికాలోని రెడ్ ఇండియన్ జాతినే నాశనం చేసిన అంశాలు



కావండి! నల్లజాతి వారితో క్రికెట్ ఆడని గొప్పలు కావండి! ఆఫ్రికాలోని అనేక ఆదిమ జాతులను మతం మార్చిన రీతులుండవండి!) లెక్కలేనన్ని పుస్తికలు (బుక్‌లెట్లు) కరపత్రాలు, పుస్తకాలు పంపిణీ చేస్తారు. ఇవన్నీ పోగా అనిల్‌లాంటి చిన్న చిన్న పిల్లల మనస్సులను పాడుచేస్తారు.

అనిల్ ఆరోజు సాయంకాలం మాయింటి ముందు ఆడుకొంటున్నాడు. ఆ అబ్బాయి మెడలో అంతవరకు ఎన్నడూ చూడని క్రాస్ కనిపించింది. నల్లటి దారందండ మధ్యన తెల్లగా ఉన్న చిటికెన వ్రేలంతటి క్రాస్.

'ఏమిటి ఇది' అడిగాను నేను దగ్గరకు పిలిచి.

'ఏసు క్రీస్తు సార్ అన్నాడు అనిల్

'ఎవరిచ్చారురా'

'మాటీచరమ్మ'

'ఆమెనే మెడలో వేసిందా!'

'అవును'

ఆమె మెడలో ఉంటుందా!'

'ఉంటుంది'

'ఎందుకు వేసుకోవాలంట'

'ఇది వేసుకొంటే దయ్యాలు పట్టవంట'

'ఎవరు చెప్పారు'

'మాటీచరమ్మ'

'మీక్లాసులో అందరు వేసుకొన్నారా'

'అందరూ వేసుకొన్నారు...'

'ఇదివేసుకొన్న రాజుకు మొన్న దయ్యం పట్టిందిరా! నేను చూశాను' అన్నాను. వెంటనే ఆ అబ్బాయి అనిల్ క్రాస్ తీసి కంపలోకి విసరేశాడు. చూడండి! తమ ప్రచారంలో ముక్కు పచ్చలారని చిన్నపిల్లల మానసాన్ని ఎంత కాలుష్యంతో నింపుతున్నారో! విద్యాసేవపేరిట ఎంత విషాన్ని ఇంజెక్ట్ చేస్తున్నారో! ప్రపంచ ప్రజాళిపై ఇటలీ పోపుల పెత్తనం రుద్దడానికి ఎంత తహ తహ లాడుతున్నారో! ఈ కిరస్తానీ పూతన విషక్షీరాల్ని చిన్ని కన్నయ్యలకు ఇంకెన్నాళ్లు కుడుపుతారో?

# ౬. చదువురాని భార్యను వదిలేయండి!

జీవదాన్ క్రిష్టియన్ మిషనరీ పాఠశాల వార్షికోత్సవ సందర్భంగా రంగస్థల ప్రదర్శనలు జరుగుతున్నాయి. ప్రదర్శిస్తున్న వారు నూటికి తొంభైఅయిదు మంది హిందువుల బాలబాలికలు, అదీ అయిదవ తరగతిలోని పిల్లలే ఎక్కువ. అప్పటికి ఈ పాఠశాలలో అంతకు మించిన తరగతులు లేవు. పిల్లల తల్లిదండ్రులు తమ తమ గ్రామాల నుండి దేవుని పల్లి దగ్గరే ఉన్న ఈ పాఠశాల వార్షికోత్సవానికి వచ్చి సంతోషంగా ప్రదర్శనాలు తిలకిస్తున్నారు.

భార్యాభర్తల పాత్రధారులు వేదిక మీదికి వచ్చారు. ఆమె పల్లెటూరి కట్టుబొట్టులో ఉన్నది; ఈయన ప్యాంటు షర్టుతో టిక్‌టాక్‌గా ఉన్నాడు.

"పల్లెటూరి చదువురాని మొద్దు. అబ్బబ్బ ఏగలేక చస్తున్నానురా దేవుడా! నాకే మంట దీనిని అంటగట్టినారురో నాయనో!..." అంటూ నెత్తి పట్టుకొని కూచున్నాడు భర్త.

"మావాళ్ళు చదువు చెప్పించకున్నా నాకన్నిపనులూ నేర్పారండి!' అంటుంది భార్య.

'ఏంపనులు వచ్చు వెధవపనులు; ముఖానికింత పసుపుపూసుకొని రూపాయంత బొట్టు పెట్టుకోవడం వచ్చు; ఛీఛీ! నువ్వు ఏనాడన్నా పౌడరు పూసుకొన్నావా! మా ఆఫీసులో 'రోసీ' చూడు ఎంచక్కా స్నో పౌడరు పూసుకొంటుందో. ('పౌడరు పూసుకోడం తెలియదు... చదువురాని మొద్దు....' అతను రుసరుసా ఆఫీసుకు వెళ్లిపోయాడు. భర్తవెళ్ళిన వెంటనే ఆ గృహిణి ఆలోచిస్తుంది. దుకాణానికి వెళ్లి పౌడర్ డబ్బా తెచ్చుకొంటుంది. సాయంకాలం భర్త వచ్చేవరకు ముఖంనిండా పౌడరు పూసుకొంటుంది) కన్నుబొమ్మలు కూడా పౌడర్‌లో మునిగిపోతాయి. భర్త ఇంటి లోనికి అడుగు పెడుతూ ఆమె ముఖం చూచి అదురుకొంటాడు.

'అమ్మబాబోయ్ దయ్యం...' అని అరుస్తాడు.



'దయ్యాన్ని కానండి మీ పెళ్లాన్ని...' అంటుంది ఆమె.

'పెళ్లామంట పెళ్లాం; ఎంత మొరటు మాట; మొరటు ముండకు మొరటుమాటలు రాక ఇంకేం వస్తాయి. చదువుకొన్నదానివయ్యుంటే హల్లో! డార్లింగ్ నేను నీ వైఫ్‌ను అనే దానివి. ఇప్పుడు నువ్వు నావైఫ్‌వు కావు నాలైఫ్‌కు నైఫ్‌వు...' అంటూ కొంత సేపు నిప్పులు తొక్కిన కోతిలా చిందులేస్తాడు.

తెరపడుతుంది; మళ్లీ తెరతొలగుతుంది. ఇది మరుసటి రోజు దృశ్యం. భర్త ఆఫీసుకు తయారవుతాడు. భార్య ఎదురుగా వస్తుంది.

"ఆముఖం చూడు ముఖం; చదువురాని మొద్దు ముఖం. మా ఆఫీసులో రోసీ ముఖం ఎంత ముద్దొస్తుందో తెలుసా! (ఊఁహూఁ తెలువదు.. ఆమె తల ఊపుతుంది) ఆ పెదవులు దొండపండ్లలా ఉంటాయే! ఎందుకో తెలుసా! లిఫ్‌స్టిక్ పెట్టుకొంటుంది! నీ ముఖం చూడు ముఖం! మాడిపోయిన పాపడ్‌లా నువ్వూ నీముఖం..." అంటూ వెళ్లిపోయాడు.

భర్త వెళ్లిన వెంటనే ఆమె కొట్టుకు వెడుతుంది. 'లిప్పుస్టిక్కు' ఇవ్వుమని అడుగుతుంది. తెచ్చుకొంటుంది; సాయంకాలం భర్త వచ్చేవరకు రెండు పెదాలనిండా, ఆపక్కా ఈ పక్కా మరో రెండంగుళాలు అంటే విధంగా ఎర్రగా లిఫ్‌స్టిక్ పూసుకొని ఎదురుగా నిలుస్తుంది.

"అమ్మబాబోయ్! ఎర్రకోతి! ఎర్రకోతి!" అని భర్త చెంగడ బింగడ గంతులేస్తాడు.

'కోతిని కానండీ! మీనాతినండీ!' అంటుంది ఆమె బుంగ మూతిపెట్టి ఆమాయకంగా.

'నాతివా! చుప్పనాతివా! ఓరిదేవుడోయ్! నాకెలాంటి చదువు రాని మొద్దును కట్టినారు నాయనోయ్! ఇదినాకు వద్దే వద్దు దేవుడోయ్!' అంటూ లోనికి వెళ్లి రోసీతో చెట్టాపట్టాలు వేసుకొని రఁయ్యిమని వేదిక మీదికి వచ్చేస్తాడు.

భార్య బిత్తరపోయి చూస్తూ ఉంటుంది. భర్త రోసీ నడుంమీద, చంకలో చేయి వేసి "టట్టడాఁ టట్టడాఁ' అంటూ, చదువు రాని భార్యకు టాటా చెబుతూ వెళ్లిపోతాడు.

అందరూ చప్పట్లు కొడతారు. ఇది చూడడానికి అందరూ చదువుకోవాలి అనే అంతరార్థాన్ని అందిస్తున్నా, హిందువులందరూ చదువురాని తమ భార్యలను వదలి మావెంబడి లేచి రాండి అనే వ్యంగ్యార్థాన్ని కాదు కాదు వాచ్యార్థాన్నే ఇస్తుంది కదా! ఇది కుటుంబ విచ్ఛిత్తికి దోహదం చేసే దగుల్బాజీ ప్రదర్శన; పచ్చి వ్యభిచారాన్ని ప్రోత్సహించే నీతిమాలిన పిచ్చి ప్రదర్శన.

ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ మరుసటిరోజు హిందూ యువకులు పదివేల కరపత్రాలను కామారెడ్డి పరిసరాల్లో పంచిపెట్టారు. అయినా సిగ్గు విడచిన ఇలాంటి ప్రదర్శనలు ఇంకా ఇస్తూనే ఉన్నారు; ఈ సమాజాన్ని కించపరుస్తూనే ఉన్నారు.

●





# 7. తెల్లోడు వదలినా 'దొర' పదం వదల్లేదు!

"మేమిక్కడ పెద్ద సంస్థ పెట్టినాము. ఆడపిల్లలకు కుట్టు నేర్పిస్తున్నాము. మగపిల్లలకు మందుల కంపెనీల ఉద్యోగాలు ఇప్పిస్తున్నాము. మేరమ్మ గుడి కట్టి అందరితో ప్రార్థన జేపిస్తున్నాము. మీ ఊళ్లో ధనవంతులు మిమ్ములను వాళ్ల గుడికి రానివ్వరు గదా. మేము అల్లాంటి వాళ్లము కాదు. ఏసు ప్రభువు దగ్గరికి మేరెమ్మ దగ్గరికి ఎవరైనా వెళ్ల వచ్చును. మీరలు ఎప్పుడైనా మేరెమ్మ గుడికి వద్దురు. ప్రార్థన చేద్దురు..." అన్నాడు ఆదారిన పోతున్న ఫాదరు కారాపి పశువుల కాడి పాపన్నతో.

పాపన్న తల ఊపి ఆయన కారు దిక్కు, కారులో కూచున్న తెల్ల బట్టల నర్సమ్మ దిక్కు చూశాడు.

'ఈ ఇబ్రహీంపట్నం రోడ్డుమీదనే యాసారం ఆవల మేము ఆసుపత్రి పెట్టినాము. మందులకు రమ్ము. ఇత్తుము...' అన్నాడు ఫాదర్.

'మాపిల్లగాడు మంచె మీద పడుకొండు. వానికి జొరమొచ్చిందేమో! చూసి పో దొర' అన్నాడు పాపన్న.

ఫాదర్ కారులోని నర్సమ్మకు సైగజేశాడు. నర్సమ్మ కారుదిగి ఓ స్టెతస్కోపుతో మందుల సంచితో వచ్చింది.

అయిదడుగుల జొన్నచేలో ఆరడుగులమంచె; ఆమంచెమీద వెల్లకిలా పడుకొన్న భద్రన్న. వీరపట్టణంలో కాలేజీ వదిలాక బస్సులో వచ్చి, చెలక దగ్గరేదిగి తలనొప్పి అంటూ మంచె ఎక్కాడు. నిద్ర కూడా పట్టింది. అయితే ఈ గోలతో లేచాడు. మంచెదిగాడు. దగ్గరికి వస్తున్న నర్సమ్మకు ఫాదర్‌కు దండం పెట్టాడు.

'ఓ సూదియ్యిదొరా పోరగానికి' అన్నాడు పాపన్న.

'నాకేంజ్వరంలేదు' అంటాడు భద్రన్న.

'సరే ఇంజక్షనేమియ్యంగాని ... ' అన్నాడు ఫాదర్.

'ఇంటర్మీడియెట్' చెప్పాడు భద్రన్న.

మినాన్నకు చెప్పినాను. దగ్గరనే మన మేరీ మందిరము ఉన్నది. మీరు కూడా ప్రార్థనకు రండు...' అన్నాడు ఫాదర్.

'మేమెందుకు' అడిగాడు భద్రన్న.

'మీరు హరిజనులు కదా'

'అవును'

మిమ్మల్ని దేవాలయాలకు రానివ్వరుకదా'

'మాదేవాలయాలు మాకున్నాయి. అయితే మేం ఏ దేవాలయాలకు వెళ్లినా ఎవరూ ఆపలేదు.'

'ఇది వరకు ఆ పారు తెలుసాచరిత్ర!'

'అప్పుడు మీ పరిపాలనే ఉన్నది. రెండువందల ఏండ్ల మీ పరిపాలనలలో అంటే క్రైస్తవుల పాలనలో మీరెందుకు అస్పృశ్యత పెంచారు. మేం దేవాలయాలకు వెళ్లకుండా ఎవరన్నా అడ్డుకుంటే మీరెందుకు వారిని ఆపలేదు. మేం అస్పృశ్యులుగానే ఉండాలనీ, మిగతా హిందువులతో మేం కలువకుండా దూరంగా ఉండాలనే ఉద్దేశ్యంతో మీరలా వ్యవహరించారని కూడా చరిత్ర చెబుతున్నది."

'ఈ చరిత్ర ఎక్కడున్నది'

'మాహిస్టరీ లెక్చరర్ చెప్పారు'

'అంతా అబద్ధం'

'మరి మీరెందుకు అస్పృశ్యత నిర్మూలించలేదు చెప్పండి! భారతీయులకు స్వాతంత్ర్యం ఇవ్వకుండా, మీరు భగత్సింగులాంటి వాళ్లను ఎంతమందిని చంపారు. కనీసం జైళ్లలో కూడా మీరు అస్పృశ్యతను ఆపలేకపోయారు.'

'సవర్ణహిందువులే అందుకు కారకులు'

'ఏంవారు జైళ్లలో మీరు పెట్టే బాధల్ని భరించలేదా! మీరు చట్టాలు చేసి



అమలు పరిస్తే వారుకాదనేవారా!"

'ఫాదర్ బిత్తరపోయి చూశాడు.

'ఈ దేశాన్ని కులాల లుకలుకలతోనే ఏలాలని మీ రాజనీతి అందుకే మీరు సంస్కరణలు కూడా సరిగా చేపట్టలేదు.'

'వాని మాటలు పట్టించుకోకండ్రిదొరా! మేం మీగుడికి వస్తాం. మీరెళ్లండి దొరా' అన్నాడు పాపన్న.

'మేం రాం' అన్నాడు భద్రన్న

'అయితే ఈ రాళ్లకే దండం పెడతారా' అన్నాడు మంచెదగ్గర పసుపు కుంకాలతో ఉన్న చిన్న గూటిలాంటి రాళ్ల కుప్పను చూపిస్తూ,

'పంటలదేవుడు దొరా! ఏమన్నా అంటే పంటలుపండవు' అన్నాడు పాపన్న.

'రాళ్ళకు మొక్కితే పంటలు పండుతాయా!'

"మీ దేవుని శిలువ... మేరెమ్మ, ఏసయ్య కూడా రాళ్లే కదా!' ఎదిరించి అడిగాడు భద్రన్న.

ఫాదర్ తత్తరబిత్తరయిపోయారు.

'ఏంకావా! రాళ్లు కాకపోతే మట్టి విగ్రహాలు; లేకపోతే కట్టె విగ్రహాలు, సిమెంటు విగ్రహాలు; ఇప్పుడేమో ప్లాస్టిక్ బొమ్మలు అంతేకదా! విగ్రహాలు లేనిదెక్కడ! ఏమతంలో లేవు. ఒకరి దిక్కు ఒకవేలు చూపితే నీదిక్కు మూడు వేళ్లు చూస్తున్నాయనేది గుర్తు పెట్టుకోవాలి' అన్నాడు గట్టిగా భద్రన్న.

'నీవు ఆర్ఎస్ఎస్ మనిషివి... అందుకే ఇట్ల మాట్లాడుతున్నావు"

'నీవు విదేశీతొత్తువు. ఆదేశాలనుండి ధనం తెస్తున్నావు. విద్య పేరిట వైద్యం పేరిట మతం మార్పిళ్లు చేస్తున్నావు. ఎప్పటికో ఈ దేశాన్ని రోంకో, బ్రిటన్కో, ఆస్ట్రేలియాకో, అమెరికాకో బానిసగా చేయాలనుకొంటున్నావు. అందుకే ఈ దేశం వచ్చి మా భాషలు నేర్చుకొన్నావు. మా మతంలోని వాళ్లనే నర్సమ్మలుగా ఉంచుకొని

వాళ్లకు నర్సని పేరు పెట్టి నాటకాలాడుతున్నావు. వాటికన్‌కు జై కొడతావు; పోపు గారికి జై కొడతావు. భారతమాతకి జై అనవు. ఇలాంటి నిన్ను కరడు గట్టిన విదేశీ మతోన్మాద తొత్తంటే తప్పేమిటి! నీ కార్యకలాపాలన్నీ దేశద్రోహకరమైనవి అని నీకు దేశ బహిష్కార శిక్ష వేస్తే తప్పేమిటి!...' చాలా గట్టిగా అన్నాడు భద్రన్న.

ఫాదర్ దాదాపు పరుగెత్తి నట్లుగా కారు దగ్గరికి నర్సమ్మతో పాటు వెడుతున్నాడు.

"దొరా!దొరా! పిల్లగాడు.. తెలియక ఏదో అంటున్నాడు ఏమీ అనుకోవద్దు' అని వెంబడి పడ్డాడు పాపన్న.

'తెల్లోడు వెళ్లి పోయినా, స్వాతంత్ర్యం వచ్చినా, ఈ నాటికీ మనం తెల్లదొరలనే పిలుస్తుండం సిగ్గుచేటు. మనకు స్వాతంత్ర్యం వచ్చినా బానిస బుద్ధిపోలేదు'.. తీవ్రంగా తండ్రి దిక్కుచూస్తూ అన్నాడు భద్రన్న.



# 8. "దయా నీపేరు దయ్యమా!

'అయిదువేలిస్తేనే, నిన్ను మా ఎస్.ఐ వదలిపెడతాడు.. లేకపోతే ఇలాగే కొట్టి ఖైమ ఖైమ జేసేస్తడు'' అన్నాడు కానిస్టేబుల్ మోహన్‌రావు లాకప్‌లోని రామలింగంతో.

'గాపైసలే ఉంటే గీపని ఎందుకు జేస్త' అన్నాడు బతిమాలుకొంటూ రామలింగం.

'మీసేటు లేనప్పుడు గల్లాలకెల్లి తీసిన పైసలు, అమ్మికొన్న బియ్యం సరకూ సరంజమాకు వచ్చిన పైసలు ఈ రెండేళ్లల్ల యాబయివేలైనా అయ్యుంటయి గదరా... అందులోకెల్లి అయిదువేలివ్వమంటున్నం అంతే' అన్నాడు మోహన్‌రావు.

'ఏబయివేలా! అయిదొందలు కూడా కాలేదు; తీసేవాణ్ణి గాని ఒకటి రెండు రూపాయలు కూడా తీయలేదు. మొన్నటికి మొన్న తీసింది రెండు రూపాయల నోటే. దాని మీద సేటు సంతకం ఉండడంతో దొరికి పోయాను. నెలకా సేటు ఇచ్చేవి ఆరొందల రూ॥లు. మా అమ్మ నేను ఓ సెల్లెలు ఎలా బతుకుతాం. అందుకే ఈ చిల్లర పనులు చేశాను. కాని నాకంటె ఎక్కువగ తీసేమరో గుమస్తా దేవయ్య అదృష్టవంతుడు; పట్టుపడలేదు. నేను పట్టుబడ్డాను... ఇప్పుడు మా ఇంట్లో ఏబయి రూ॥లకంటే ఎక్కువ లేవు. నాకిక్కడ అప్పు కూడ ఎవ్వరివ్వరు. పాలమూరు నుండి బతకడానికొచ్చినోణ్ణి.. మీకు దండం పెడతా; నన్నెట్లన్న విడిపియ్యి బాబూ... మా అమ్మా సెల్లెలు ఈరెండురోజులుగా ఏడుస్తున్నారు..'' కాళ్ళు పట్టుకొన్నాడు రామలింగం.

"ఛస్...పో...బే నీవూ ఆఎస్సయి ఎక్కడన్నా పడి సావండి.. నన్ను అడగమన్నడు అడిగినా ఇంగనీ ఇష్టం''.. అంటూ వెళ్లిపోయాడు మోహన్‌రావు.

సేటు శ్రీశైలం తన పర్సులోని రెండురూపాయిలనోటు చూడడం వల్లనే ఇంత ముప్పు వచ్చింది. తాను అంగీఇడిసి కొయ్యకు తగిలించి బియ్యం కొలుస్తున్నడు. అంగీల నుండి గంటక్రితమే తాను తీసిన ఆనోటు పడింది. సేటు కంటపడింది. ఫోన్ గొట్టిండు. పోలీసోళ్లకు పట్టి... స్టేషన్లకు

వచ్చినప్పుడల్లా నాల్గు తన్ని పోతున్నడు. భర్త చనిపోయాక దాచిపెట్టిన ముక్కు పుల్లను అమ్మి పైసలు తెస్తానని తల్లి అంటే తానే వద్దన్నాడు. అయినా దాన్ని అమ్మినా తమ ముఖాలకు నూరురూపాయలకంటె ఎక్కువ ఇవ్వరు. రేప్రొద్దున ఏం జరుగుతుందో ఏమో!

ఈ ఆలోచనలతోనే రాత్రంతా గడిపాడు రామలింగం. తెల్లవారింది. లాకప్‌లో తనతో ఉన్నవారు ఓబన్నూ ఓచాయ తెప్పించుకొన్నారు. తల్లి ఇచ్చిపోయిన అయిదు రూపాయల్లో ఇప్పుడు రెండు రూపాయలే ఉన్నాయి. ఆరెండివాళ బన్నుకు చాయకు ఖర్చయినై.

తొమ్మిది గంటలవుతుంది. ఎస్ఐ స్టేషన్లోకి వస్తున్నాడు. ఆయన వెనుకా ఓ ఫాదర్, అతని వెనుక తన తోటి గుమస్తా దేవయ్య ఉన్నారు. దేవయ్య డేవిడయ్యాడు. దానికేదో కథ చెప్పాడు. ఈ డేవిడ్ ఫాదర్ను తీసుకొని వస్తున్నాడా! లేకపోతే తన తల్లి అతణ్ణి పంపించిందా! అర్థం కావడంలేదు రామలింగానికి.

ఓపదిహేను నిమిషాల తర్వాత ఎస్.ఐ ఫాదర్ ఇద్దరు వచ్చారు. వారి ముందు పరుగెత్తుకు వచ్చి ఓ కానిస్టెబుల్ లాకప్ తలుపు తెరిచాడు.తనను పిలిచాడు.

తాను వారిని అనుసరించాడు. 'అరేయ్ రామలింగా! ఈ ఫాదర్ గారు చెబుతున్నారు కాబట్టి విడిచి పెడుతున్నాను. వెళ్లు; బుద్ధిగా ఉండు. ఫాదర్‌మీద ప్రభువుమీద విశ్వాసం పెట్టుకొని బ్రతుకుపో; బాగు పడతావు!' అన్నాడు కట్టెతో వీపు మీద టకటకలాడిస్తూ ఎస్.ఐ.

ఎస్.ఐ కాళ్ల మీద పడి లేచాడు రామలింగం. నాకాళ్ల మీద ఎందుకురా ఆ ఫాదర్ కాళ్ల మీద పడు' అన్నాడు ఎస్.ఐ అక్కణ్ణుండి వెళ్లిపోతు. రామలింగం ఫాదర్ కళ్లమీద పడ్డాడు. "బిడ్డా! నాకాళ్ల మీద ఎందుకు! ఆ ఏసు ప్రభువు కాళ్ల మీద పడు" అని నెత్తిన చేయి పెట్టాడు ఫాదర్.

దేవయ్య ముందు, ఫాదర్ వెనుక, రామలింగం ఆ వెనుక వరుసగా రోడ్డుపైకి వచ్చారు. స్టేషన్ ముందున్న కారెక్కాడు ఫాదర్. సాయంకాలం చర్చికి రమ్మని చెప్పి వెళ్లి పోయాడు.



సిటీ అవుట్‌స్కర్ట్స్‌లోని జీడిమెట్ల పోలీసు స్టేషన్నుండి ఫాదర్ కారు సూరారం చర్చి వైపుగా సాగిపోయింది. ఆవైపు వెళ్లే బస్సెక్కారు దేవయ్య రామలింగం.

సూరారంలో ఓ చిన్నగది. అది కూడా తమ ప్లాటు రక్షణ కొరకు యజమాని ఎవరో కట్టుకొన్నది, అందులో తల్లితో చెల్లెలితో ఉంటున్నాడు రామలింగం, అతనికో ఫర్లాంగు దూరంలో దేవయ్య ఉంటున్నాడు.

ఇంటికి వచ్చాడు రామలింగం, తల్లీ చెల్లెలు అతణ్ణి పట్టుకొని ఏడిచారు. ఉన్న ఊరును వదలిన రైతుకూలీ కుటుంబం. ఇక్కడే అక్కడక్కడ బంధువులున్నారు; ఎవరి దారి వారిది; ఎవరి బ్రతుకువారిది. ఒళ్లు వంచి పనిచేసి ఆయా ఫ్యాక్టరీల - దుకాణాల - హోటళ్ల - కార్ఖానాల యజమానులను మెప్పించి పర్మినెంటయిపోవాలని ఈ పల్లె ప్రవాసీల కాందిశీకుల తపన. అప్పుడప్పుడు ఒకటి రెండు రూ॥ల దగ్గర కక్కుర్తి. ఆ కక్కుర్తే రామలింగాని కింతగుణపాఠం నేర్పింది.

ఆ రోజు సాయంకాలం ఆరుగంటలకు దేవయ్య వచ్చాడు. అతనికి దండం పెట్టి, '-నాయనా! నాబిడ్డను విడిపించినవు; మీఫాదర్‌కు వేలదండాలు. అయిదువేలు కాదు కదా అయిదురూపాయలు కూడా ఇచ్చే అస్యత్ లేనోళ్లం, అయిదు పైసలు ఖర్చుకాకుండా ఇడిపిస్తివి.. ఏంచెప్పిందో ఆ ఫాదరయ్య; అమీన్సాబు నాకొడుకును ఇడిసిండు, సచ్చి నీకడుపుల పుడత బిడ్డా!' అని మరోసారి దండం పెట్టింది రామలింగంతల్లి.

'మరేంఅనుకున్నారు మాఫాదరు సెబితే రాజీవగాంధి భార్య సోనియాగాంధి వింటది; బ్రిటన్‌రాణి ఎలిజబెత్ వింటది; అమెరికా ప్రెసిడెంటు బిల్ క్లింటన్ వింటడు" కాలర్ ఎగిరేశాడు దేవయ్య.

తల్లిచెల్లెలు రామలింగం బిత్తరపోయిచూశారు.

"ఫాదర్ దగ్గరికి పోదాం" అన్నాడు దేవయ్య

నలుగురు బయలుదేరారు. ఫాదర్ను చర్చి పక్కనే ఉన్న విశాలమైన గదిలో కలిసి దండం పెట్టారు. అయన వారిని చర్చిలోకి తీసుకొని వెళ్లి ప్రభువు ముందు

మోకరిల్ల జేశాడు. ప్రభువు ప్రసాదం తీసుకొండంటూ బ్రెడ్డిచ్చాడు, బట్టలిచ్చాడు, బైబిలిచ్చాడు, వెయ్యిరూపాయలిచ్చారు.

అప్పుడప్పుడు ఇలాగే వచ్చి ప్రభువు ప్రసాదం తీసుకోండి!" అని ప్రార్థన చేయించి పంపించాడు.

మరుసటిరోజు రామలింగం ఓ హోటల్లో చేరాడు; సాయంకాలం ఇంటికి వస్తుంటే దేవయ్య కనిపించాడు. నిన్నరాత్రి ఫాదర్ మరొకరు ఓయింట్లో ప్రార్థన చేసి, బైబిళ్లు పంచి పెట్టి వస్తుంటే ఎవరో దాడి చేసి కొట్టి వెళ్లిపోయారన్నాడు.

'విదేశీమతాల్లోకి మార్చే ఈ కుక్కల కొడుకులను తన్ని వదలి పెట్టొద్దు; నరికి పోగులు పెట్టాలి' అంటూ అటుగా వెళుతున్న ఓయువకుడన్నాడు. దేవయ్య ఎవరైనా తనను తంతారేమో అనిపారిపోయాడు. రామలింగం కీసర రామలింగేశ్వరునికి దండం పెట్టుకొంటూ ఇంటివైపు నడిచాడు.

●



# 9. నాటకం - దొంగాటకం

ఈ మధ్య బ్రిటన్‌కు చెందిన ఓ 18 ఏళ్ల అమ్మణ్ణి 82సం॥ల వృద్ధుణ్ణి పెళ్లి చేసుకొన్నట్టు పేపర్లో చదివాం. అదేంటి అంటే నాఇష్టం అంది. ఆముసలి వరుణ్ణి అడిగితే ఆమె ఇష్టం నాఇష్టం అన్నాడు.

ఆయన ఆపడచు పెళ్లాం చేతికి ఉంగరం పెట్టేప్పుడు వణికాడా! ఆమె మెళ్లో మాలవేస్తుంటే క్రిందికి తలవంచబోయి పడ్డాడా! మెట్లు ఎక్కేప్పుడు గజగజవణకుతుంటే ఆమె ఎత్తుకొని వెళ్లిందా!

ఎక్కడా! ఎవరు! ఏప్రశ్నావేయలేదు. ఎవరికేం పట్టనట్టున్నారు. ఎందుకు! అది బ్రిటన్ కాబట్టి!

అదే ఇక్కడైతే నానాయాగీ చేసేవారు. మన మహిళా సంఘాలన్నీ ముసలి వరుని ఇంటిముందు ధర్నా చేసేవి! ముప్పయేళ్ల వరునికి తొట్టెల్లోని మూడేళ్ల పాపకు వివాహం చేసే కాలం చెల్లిపోయిందని నానాయాగి చేసేవి. ఆ ముసలి మొగుడికి గోచి పెట్టుకోను రాకపోతే ఆ అమ్మాయే గోచీదోపిందని మన పత్రికలు కట్టుకథలు కట్టేవి!

శతాబ్దాల ముసలి మొగుళ్ల పడుచుపెళ్లాలకథలు పత్రికలు సీరియల్స్‌గా ప్రచురించేవి. ఇప్పుడీ పెళ్లిళ్లు జరుగకున్నా జరిగినాయనీ -జరుగుతున్నాయని కొందరు నాటకాలు వ్రాసే వారు; ప్రదర్శించేవారు.

పోనీ హిందూస్ తమను గురించి ఏదో వ్రాసుకొన్నారంటే సరే వారిని వారు బాగుచేసుకొంటున్నారని అనుకోవచ్చు. మరి మధ్యన క్రిష్టియన్సు ఈ ఇష్యూను తీసుకొని ఇటీవలే నాటకం ప్రదర్శించడమెందుకు!

ఆ కథాకమామిషు చదవండి!

అదొక క్రిష్టియన్ పాఠశాల. ఓ మండలకేంద్రం గుండా వెళ్లే హైవేకు ఒకమైలు దూరంలో ఉంది. పక్కనే మరో పల్లె ఓ చర్చి ఉండి!

ఆ పాఠశాల వార్షికోత్సవంలో అన్నిట్లో అదో ప్రదర్శన.

నవవధువును అలంకరించి వేదిక మీదికి తెస్తారు. ఆమెచలాకీగా హుషారుగా ఉంటుంది. ఆ కట్టెను ఊతంగా పట్టుకొని వణకుతూ ముసలి వరుడు కిందా మీదా పడుతూ వస్తూ ఉంటాడు. అతణ్ణి ఇద్దరు పట్టుకొని వచ్చి పీటల మీద కూచోబెడతారు. అతను వణకుతుంటాడు. కళ్లలో ఊసులుంటాయి. ముక్కు నుండి నీళ్లు కారు తుంటాయి. చీదుతుంటాడు.

పురోహితుడుచదివే మంత్రాలు అస్పష్టంగా గందర గోళంగా ఉంటాయి.

ఇక ఏలాగో ఓలాగ పురోహితుడు అతని చేతికి తాళిబొట్టు అందిస్తాడు. అతను వణకుతూ ఓపది సార్లయినా దానిని క్రింద పడవేస్తాడు. పురోహితుడు మాటి మాటికి అందిస్తాడు.

తనకీ పెళ్లి అక్కర లేదని మాటిమాటికి పెళ్లి పిల్లలేచి పోవడానికి ప్రయత్నిస్తుంది. 'ఆముసలాయన తక్కువ డబ్బిచ్చాడా!' అంటూ ఆ పిల్లతల్లి, బిడ్డను మెడలు విరిచి కూచోబెడుతుంది.

చివరికి ముసలివరుడు తాళిని మెడవరకు తీసుకొని వెళ్లిపడిపోతాడు. అప్పుడు అతని చేతిలోని తాళిని పురోహితులుచేపట్టి ఆ అమ్మాయిమెడలో కట్టి...' మాంగల్యం తంతునానేన.. మమజీవనహేతునా..." అని రాగంతీస్తాడు.

నలుగురు ఓపాడెతెచ్చి, ఆపడిపోయిన ముసలి వరుణ్ణి పాడెపై పడుకోబెట్టుకొని 'ఆం ఊం ఓం' అంటూ ఎత్తుకొని వెళ్లిపోతారు.

ఆ అమ్మాయి ఏడుస్తుంటే తల్లి ఓదారుస్తూ లోనికి తీసుకొని వెడుతుంది. చూస్తున్న జనమంతా పోలో అని చప్పట్లు కొడతారు.

క్రిష్టియన్ మిషనరీ స్కూలు వారు ఎందుకీ నాటకం ఆడారు! "ఈడుజోడులేని పెళ్లికూడదు" అనే సందేశం అందివ్వడానికే ఈనాటకం ఆడారని ఎవరైనా అంటారు! సరే!

కొద్ది ఆలోచిస్తే హిందూ సంప్రదాయాల్ని అవహేళన చేయడానికి 4,5 తరగతులలోని హిందువుల పిల్లల చేత క్రిష్టియన్ పంతులమ్మలు ఆడించిన



ఆటగా అర్థమవుతుంది. ముసలి మొగుడు పెళ్లి పీటల మీద చనిపోతే ఎవరైనా ఎప్పుడైనా - ఎక్కడైనా పురోహితుడు తాళిగట్టగా చూశారా!

మరి ఈ దగుల్బాజీ నాటకమేంటి! ఎవరిని కించపరచడానికి ఈ దొంగాటకాలు! తాము ఏదేశంలో ఉండి, ఎవరిసొమ్ముతింటూ ఎవరిని అవహేళన చేస్తున్నారీ కిరస్తానీలు! ఇవేనా చదువులు! చిన్నారి పిల్లల మనస్సులు పాడుచేసే ఈ ముసలి మొగుడు పెళ్లితంతు ఈ దేశంలో వీళ్లింకా ఎన్నాళ్లు ఆడతారు! ఈ హిందూ సమాజం ఇంకెన్నాళ్లు భరిస్తుంది!



# 10. అమ్మా! ఈ గుండె తడి ఆరదమ్మా!!

"ఇవాళ ఇక్కడ మీరందరూ 'అమ్మ' గురించి మాటాడారు. ఆపదంలో అమృతమున్నది; చల్లదనమున్నది; వెచ్చదనమున్నది.

అమ్మ గర్భంలో ఉన్నప్పుడు ఎంత రక్షణ! ఈ లోకాలేవీ పట్టని విధంగా, సృష్టికర్త అక్కడ తొమ్మిది మాసాలు ఎదుగుమన్నాడు. జగన్మాత అండపిండ బ్రహ్మాండాలను తన గర్భంలో ఇముడ్చుకొని, తన చల్లటి హస్తంతో వాటిని నిమురుతూ తన ఊపిరిలోని ఊపిరిగా వాటికి చైతన్యాన్ని ప్రసాదించి నట్లు అమ్మనన్ను ఆప్యాయంగా నిమిరిన కాలంలో నేనెంత హాయిననుభవించానో!

ఏ కష్టాల కడగళ్లు చుట్టముట్టని ఆకాలం ఎవరం మరచిపోతాం! ఇప్పుడది ఊహా ప్రపంచమే. ఆప్రపంచంలోనే జీవితమంతా ఉంటే అమ్మ ఆశయాలు నెరవేర్చలేమెమో! అందుకే వాస్తవ ప్రపంచంలోనూ అమ్మ వెన్నుతట్టి నడుపుతున్నది. ఈ చేతి తడే ఈ చైతన్యం.

ఈ ఆషామషీ వెంకట సత్యనారాయణ గారు తమకుటీరంలో మనమందరం కలిసి అమ్మగురించి ముచ్చటించుకొనేట్టు చేశారు. ఈ కుటీరంలో నిరంతరం నవ్వుల పన్నీరు కురుస్తుంది. ఇవాళ ఒక్కొక్కరిక్కడ అమ్మ గురించి మాటాడుతుంటే నాకన్నులు చెమ్మగిల్లుతున్నాయి; నాగుండె కన్నీటి మయం; కాని అది కన్నీరు కాదు; అది పరిమళాల పన్నీరు.

నావయస్సిప్పుడు ఏభై రెండు ఇది పందొమ్మిది వందల ఎనబయిరెండో సంవత్సరం. నేనిప్పుడు నాపుట్టిన రోజు నాటికి వెళ్లిపోతున్నాను.

మానాన్న రిక్షాపుల్లర్. పది డబ్బులు ఏనాడు చేతుల్లో మిగులుచ్చుకోలేదు. మిషనరీ హాస్పిటల్లో అమ్మ ప్రసవ వేదన పడుతున్నది. డాక్టర్లు ఆయాలు వారి ప్రయత్నం మేరకు వారు ఆ పవిత్ర కార్యంలో నిమగ్నులయ్యారు. కేరు కేరు మంటూ నేనీలోకంలో అడుగుపెట్టాను. మాయమ్మ నన్ను చూచుకోకుండానే కన్నుమూసింది.



ఓనర్సు ఈసంగతి మానాన్నకు చేరవేసింది. పిల్లవాణ్ణి మాకు వదలిపెట్టు. మేం ఆ బాబును మంచి కిరస్తానీగా పెంచుతాం అన్నది.

మాఅమ్మపోయి మానాన్న ఏడుస్తుంటే, అతణ్ణి ఓదారుస్తూ ఉన్న మాయత్త అంటే మా నాన్న చెల్లెలు ఈ మాటలు విని బిత్తరపోయింది. మాయత్త పూలమ్మ. బెజవాడ కనకదుర్గమ్మ పాద పద్మాల దగ్గర ఆమెట్ల మీద కూచోని పూలమ్ముకొంటున్నది. ఆమెచేత అల్లిన దండలు ఆ దుర్గమ్మ మెడలో ఎన్ని పడ్డాయో!

మా నాన్న రెండుచేతులు నెత్తికి పెట్టుకొని ఏడుస్తున్నాడు.

'మా అబ్బాయిని మేమే పెంచుకొంటాం' మా పూలమ్మత్త నర్సమ్మతో గట్టిగా అన్నది ఏడుస్తూనే, ఓవైపు నాన్నను ఓదారుస్తూనే.

'అబ్బాయిని ఇవ్వకపోతే పది రూ॥లు కట్టి శవాన్నీ, అబ్బాయిని తీసుకొని పొండి! లేకపోతే ఇక్కడి నుండి శవం కదలదు; ఇప్పుడే పుట్టిన వాడూ ఏడీచేడిచి చస్తాడు' చాలా పౌరుషంగా అని నర్సమ్మ వెళ్లిపోయింది.

మాయత్త మా అమ్మశవం దగ్గరికి వచ్చింది. ఆమె మెడలో ఉండాల్సిన మంగళసూత్రం లేదు. శవం మీది వెండి మంగళ సూత్రం, ముక్కుపుల్ల, కాళ్ల మెట్టెలు ఎప్పుడు మాయమయినాయో ఎవరికీ తెలియదు.

మానాన్నకీ విషయం మాయత్త సైగలతోనే చెప్పింది. ఆయన మాయమ్మ కాళ్లమీద పడి ఏడిచాడు.

"ఊఁతొందరగా డబ్బులు కట్టి శవాన్ని తీసుకపోండి! డబ్బులు లేకపోతే బాబును వదలి పెట్టి శవాన్ని తీసుకపోవచ్చు. డబ్బుల క్రిందికి బాబును మేం ఉంచేసు కొంటాం..." అన్నాది కిరస్తానీ నర్సమ్మ.

మా పూలమ్మత్త తన మెడలోని మంగళసూత్రాన్ని తీసి పసుపు దారాన్ని వేరుచేసి మళ్లీ మెళ్లో వేసుకొని, మాంగళ్యాన్ని ఆనర్సు చేతిలో పెట్టి మానాన్నవైపు చూచింది. మానాన్న అంత దుఃఖంలోను మాయత్తవైపు చూచి, అత్త చేసిన సైగను అర్థంచేసుకొన్నాడు. మాయమ్మను తన రెండుచేతుల్లో పైకెత్తుకొని ఆస్పత్రి వదలి బయటకు వచ్చాడు.

మాయత్తనన్ను తీసుకొని గుండెకు హత్తుకొంది. అలా గుండెకు హత్తుకొన్న ఆమె గుండెల్లో ఆవిషాదసమయంలో కూడా పాలవరద పోటెత్తింది. నన్ను తన కొంగుచాటును చేసుకొని మాయమ్మ శవం వెంట నడిచింది.

మాయత్త, మాపూలమ్మత్త, విజయవాడ కనకదుర్గమ్మ మెట్ల మీద పూలమ్మే మా పూలమ్మత్త, పూలమెత్తదనాలమీద, ఆలోకమాత పాదాల చెంత, తన గుండె అనే అమృతభాండం మీద, పూలవాసనల మధ్యనన్ను పెంచింది.

నన్ను కన్నమ్మ కన్నుమూస్తే, నేను అనాథనైపోయాను. పది రూ॥లు చెల్లించలేని మానాన్న కిరస్తానీలకు నన్ను అమ్ముకొని ఉంటె నేనేమైపోయేవాణ్ణి! మాయమ్మ ఎవరంటే నేనేమనిచెప్పుకొనే వాణ్ణి.

నాకు ఈ భౌతిక దేహమిచ్చిన మాయమ్మ, నన్ను నేల మీద నిలదొక్కుకొనేట్టు చేసిన ఈ భారతమ్మ (నేలతల్లి), నన్ను పూలల్లో పెంచిన పూలమ్మత్త మాయమ్మ, కనకదుర్గమ్మ జెడలో మల్లెలు తురుమడానికి వచ్చి నన్ను చూచి పాలిచ్చిన మరోయమ్మ, నాపై తన నేత్రాల కాంతిని ప్రసరించిన కనకదుర్గమ్మ... ఇందరూ మాయమ్మలే. ఈ మట్టివాసన నా ఒంటికి పంచేట్టు పెంచిన అమ్మలే.

నేనిప్పుడు ఈ హైదరాబాదులో లాయర్ను; హైకోర్టు లాయర్ను. నన్నింత వాణ్ణి చేసిన మాపూలమ్మత్త ఈ గుండెల్లో ఉంది. ఇక నేనేంచెప్పేది! మాయమ్మను చంపి ఆశవం మీద బేరమాడిన ఆ కిరస్తానీ నర్సమ్మలను మాపూలమ్మత్తతో పోల్చుకొంటే, శవాల మీద మతం మార్పిడి బేరాలు చేసే ఆయమ్మలనూ వారి మిషనరీల పిశాచాలనూ అమ్మలని అందునా! నోరు వస్తుందా! గుండెకనలిపోతుంది.

అయినా, అంతదీనస్థితిలో నన్ను అమ్ముకోనట్టి ఆపూలమ్మే మాయమ్మ, ఆయమ్మకు బతుకుతెరువుకు దారి చూపిన కనకదుర్గమ్మే మాయమ్మ, మమ్మల్ని నిలిపిన ఈ నేల తల్లి భారతమాతే మాయమ్మ. నన్ను ఆవరించుకొని నాలోనే ఉన్న ఈయమ్మలను నేను మరుస్తానా!" ఆయన అలా అంటూ అంటూ మెల్లగా కూచున్నాడు. ఆ ఆషామాషీ కుటీరం ఆర్ద్రమయిపోయింది. గుండెల తడి కళ్లల్లో కనిపించింది. ఆ కుటీరంలో నేనున్నాను. నాకలం తడి ఆనాటి నుండి ఈనాటికి ఆరలేదు అది ఆరదు, అమరప్రేమ కాబట్టి.





# 11. జెండాకు దండమా! ఇహిహీ!!

ప్యూన్ వీరన్న మాటవిని అయిదార్గురు ఉపాధ్యాయులు అవాక్కయి ఒగరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు.

'నిజం సర్! నా చెవులారా విన్నాను' అన్నాడు వీరన్న.

'ప్రతి జెండా వందనానికి సెలవు పెట్టినట్లే దీనికీ సెలవు పెట్టినాను. నాపదిహేనేళ్ల సర్వీసులో ఇంతవరకు 15వ ఆగష్టు నాడుగానీ, 26వ జనవరినాడుగానీ నేను జెండా ఎగరవేయలేదు. కొబ్బరికాయకొట్టలేదు; గాంధిగారి బొమ్మకు బొట్టు పెట్టలేదు; మనం క్రిష్టియన్సుం; ఈ బ్లడీ ఇండియా స్వాతంత్ర్యం మన మెందుకు జరుపుకోవాలి...' హెడ్‌మిస్ట్రెస్ దయామణి మాటలు విన్న ప్యూన్ వీరన్న అలాగే వెనక్కు తిరిగి వచ్చాడు.

ఆరోజు ఉదయం 8గంటలకు జెండా ఎగరవేయాలి. సికింద్రాబాదులోని ఓ ప్రభుత్వోన్నత పాఠశాలలో కార్యక్రమం. ఎనిమిది కావస్తుంది. టీచర్స్ వచ్చారు; విద్యార్థినీ విద్యార్థులు బారులుగా నిలబడ్డారు. మరోహైస్కూల్ నుండి ఆ సంవత్సరమే దయామణి ప్రధానోపాధ్యాయురాలు బదిలీ అయివచ్చింది. మేడం సెలవు పెట్టిన సంగతి తెలియని ఒకరిద్దరు టీచర్సు ప్యూన్ వీరన్నను పిలిచి 'అమ్మగారి ఇల్లు దగ్గరేకదా! త్వరగ వెళ్లిరా వీరన్నా' అని పంపించారు.

అలా వెళ్లిన వీరన్న మోసుకొచ్చిన వార్త అది. ఈ వార్త విన్న అయిదార్గురు ఉపాధ్యాయుల్లో సీనియర్ బి.యిడి అసిస్టెంటు, అప్పుడప్పుడు ఇంచార్జి హెడ్మాస్టర్‌గా వ్యవహరించే వేంకటాచలం కూడా ఉన్నాడు. ఆయన ఒక నవ్వు నవ్వాడు. ఆ నవ్వులో తీవ్ర తిరస్కారమున్నది.

'నాకు తెలుసు గత అయిదారు జాతీయ పర్వదినల్లో ఈ దయామణి ఇలాగే వ్యవహరించింది; ఇప్పుడూ ఇలాగే వ్యవహరిస్తుందని; అయినా వీరన్నను మీరు పంపుతుంటే ఎందుకులేఆపడం అని ఊరుకొన్నాను; పదండి మనమే గాంధీకి బొట్టు పెడదాం! కొబ్బరికాయకొడదాం! జాతీయజెండా ఎగురవేద్దాం! మన పిల్లలందరికీ మిఠాయిలు పంచి

జెండా ఎగిరింది! అందరూ వెళ్లిపోయారు. కమిట్‌మెంటున్న ఆ అయిదార్గురు ఉపాధ్యాయులు సాయంకాలం ప్రదర్శించే 'భరతమాత' నాటిక రిహార్సల్స్ చూస్తూ సలహాలిస్తున్నారు. కిటికీ ఆవల ఎల్లన్న కంఠం ఖంగున మ్రోగింది.

'బ్లడీ ఇండియా అందాముండ!'

'అవునురా' వీరన్న కంఠం

'మరి ఇండియాల ఎందుకుంది! ఇంగ్లండుకుపోక!'

'సమయంజూసుకోని తోక జాడిస్తది.'

'అదెక్కడ జాడిస్తదిరా! నిన్న మొన్న కిరస్తానీల పుస్తకాలను పిల్లలకు పంచిపెడుతున్నది. నేను పిల్లల దగ్గరి నుండి అన్నీలాక్కొని కాల్చేసిన! అమ్మదొంగముండ! ఇప్పుడు తెలిసింది! దానికి మల్లా ఈదేశం కిరస్తానీల సేతుల్లోకి పోవాలని ఉంది. అందుకే దాని మగడు పల్లెల్ల దిరిగి పచారం చేస్తున్నడు...'

ఆ అయిదుగురు అధ్యాపకులు, విద్యార్థులు తమరిహార్సల్స్‌మాని ఈ మాటలే వింటున్నారు. ప్రభుత్వ కిరస్తానీ ఉద్యోగుల గురించి ఆలోచిస్తున్నారు.

వారు ప్రతి ఒక్కరు చర్చికి వెడతారు. బుక్‌లెట్లు పంచుతారు. పాటలు పాడతారు. మతాంతరీకరణచేసి డబ్బులు దండుకొంటారు. తాము ఎప్పుడైనా ప్రసాదం పెడితే తినరు. జాతీయనాయకుల గురించి, పర్వదినాల గురించి తాముచర్చిస్తే అక్కడ నిమిషమైనా ఉండకుండా వెళ్లిపోతారు. వారంతా కలిసికట్టుగా ఉంటూ పైకి దయా - ప్రేమ అంటుంటారు. గోముఖ వ్యాఘ్రాల్లా, తేనేపూసిన కత్తుల్లా, పయోముఖ విషకుంభాల్లా వ్యవహరిస్తారు. ఒంటరి హిందువును పట్టుకొని పురిఎక్కిస్తారు.

ఇప్పుడు మదర్‌థెరిసా మాధ్యంగా మతాధిపత్యానికి ప్రయత్నిస్తున్నారు. రేపు సోనియా మాధ్యంగా రాజ్యాధిపత్యానికి పన్నాగాలు పన్నుతారు. అంతర్జాతీయ క్రైస్తవుల కుట్రల్ని ఈ దేశంలోని మిషనరీలు అమలు పరుస్తున్నాయి.

వీరన్న, ఎల్లన్నల్లో ఉన్న స్పందన మనలో లేదు అన్నాడు వెంటాచలం.

'మాలో ఉందిసర్!' పదోతరగతి విద్యార్థులు పిడికిళ్లెత్తి పట్టి గట్టిగా అన్నారు.



# 12. దగాదగా!! మోసంబిగా బిగా!!

ఆర్భాటంగా అరుపులు - కేకలు.

ఓదేవా ఈ పాపులను రక్షించుమంటూ ఆవాహనం.

జనమంతా తదేకంగా ఆ ఆరుస్తున్న ఫాదర్‌గారి వైపు దృష్టి సారించి ఉన్నారు. ఆయన ఒక్కొక్కరినే పిలుస్తున్నారు. బ్రెడ్డు చేతిలో పెడుతున్నారు. పానీయం నోటిలో పోస్తున్నారు. అందరూ అది తిని, అది త్రాగి మళ్లీ వెనక్కి వచ్చికూచున్నారు.

ఈ స్వస్థత కూటమిలో మీకు ఎవరెవరికి ఏయే రోగాలున్నాయో అవన్నీ మాయమవుతాయి. ఏసుక్రీస్తు కరుణామయుడు. ఆయన నామం తలచుకోండి! ఆయన మీద విశ్వాసం పెట్టండి, మీశరీరంలో ఎక్కడెక్కడ నొప్పులున్నాయో, ఎక్కడెక్కడ బాధగా ఉందో అక్కడక్కడ మీ కుడిచేతి పెట్టండి! ఏసు నామమే మధురమూ - మనరోగాలు సుదూరమూ' అని నేను చెప్పే ఈ పాటను అందరూ పాడండి!

ఏఒక్కరు పక్క దృష్టి పెట్టరాదు. అందరి దృష్టి ప్రభువు మీదనే. అందరి ఆలోచనలు ప్రభువు మీదనే ఆయన రూపం మీ కళ్లల్లో ఉండాలి. ఆయన రుణాలు మీ మనస్సుల్లో ఉండాలి. ఆయన మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాడు. మీకు ఉన్న ఆరోగం పెద్ద రోగం; మీరు చేసిన మహాపాపం వల్ల వచ్చింది. ప్రభువు ఆ పాపాన్ని దూరం చేస్తున్నాడు. ఇప్పుడు మీ నొప్పి మాయమయింది.

పూర్తిగా మాయమవుతుంది. ఒక్కసారి, మాయమయిందని తలచుకోండి! మాయమయింది; నొప్పి మాయమయింది. రోగం మాయమయింది. ఇకమీరు స్వస్థులయ్యారు.

ఎక్కడ నొప్పి ఉందో అక్కడ గట్టిగా ఒత్తి చూచుకోండి! మీకు ఇక నొప్పే కనిపించదు. ఎంత మాత్రం కనిపించదు.

శామ్యూలూ! నీనొప్పి మాయమయిందికదా! ఎక్కడ నొప్పి ఉండే! గుండెలో

ఉండె కదా! చూడండి! శామ్యూలుకు గుండెనొప్పి మాయమయింది. అట్లే రాములుకు తగ్గిపోయింది; కృష్ణునికి తగ్గిపోయింది.

'బాబూ! నీపేరేమిటి!'

'అశోక్!'

'నీకెక్కడ నొప్పి ఉన్నది! కాలుమీదనా! మోకాలుమీదనా! గట్టిగా ఒత్తి చూడు! నొప్పి ఉన్నదా! తగ్గిందా!

'తగ్గింది'

'పూర్తిగా తగ్గిందా!'

'ఈరోజే వచ్చావా!'

'అవును'

'ఈరోజు వచ్చినా, ఇంతకు ముందు రాకున్నా ప్రభువు దయచూడండి! ఎంత గొప్పదో! నొప్పి అంతా తగ్గిపోయింది!'

'నిన్ను దేవుడు చల్లగా చూచుగాక! పోయిరానాయనా! నీనొప్పి పోయింది! అలాగే పోగొడతాం! నీవు ఎప్పుడో బాప్తిస్మం తీసుకొంటావు. అందుకే నీ నొప్పి దేవుడు దూరంచేశాడు... పోయిరా' అని నోట్లో ఇంత ద్రావకం పోశాడు.

ఇదంతా గోడ మీది నుండి నేను చూస్తూనే ఉన్నాను. మబావమరిది అశోక్.. నవ్వుతూ వచ్చాడు.

నేను వెనక్కు తిరిగాను. అశోక్ విరగబడి నవ్వుతున్నాడు.

నిన్న క్రికెట్ ఆటలో అశోక్ మోకాలికి దెబ్బతాకింది. నిన్నటి నుండి టర్పెంట్ అయిల్‌తో రాస్తున్నాడు. రెండు మూడు ఇంజక్షన్లు తీసుకొన్నాడు. వాటికి దాదాపు 50రూ॥లు ఖర్చయినై. ఖర్చు లేకుండా నయం చేసే పద్ధతి ఇది బాగానే ఉంది!

'ఏంటి అశోక్! నిజంగా నొప్పితగ్గిందా!' నేనడిగాను.

'లేదు.. తగ్గలేదు... మంత్రాలకు చింతకాయలు రాలుతాయా!,



మందు లేకుండా పుండులొంగుతుందా! మదర్‌థెరిసా ఎన్నిసార్లు ఆపరేషన్ చేయించుకోలేదు...' అదోరకంగానన్నాడు అశోక్.

"మరి తగ్గిందని, అక్కడ అబద్ధం ఎందుకు చెప్పావ్!"

'వాళ్ల ఇంట్లో మనం కిరాయకున్నాం; వాళ్లు కూటమికి రమ్మన్నారు; ఇలా అడుగుతారనుకోలేదు; వాళ్ల నమ్మకాన్ని మనమెందుకు కాదనాలి; అందుకే అబద్ధమాడాను; లేకపోతే శామ్యూల్‌కు గుండెనొప్పి తగ్గడమేంటి! ఈ ప్రార్థనలకే తగ్గితే అతను ఎల్లుండి బైపాస్ ఎందుకు చేయించు కొంటున్నాడు. ఈ స్వస్థత కూటాలన్నీ దగ... దగా.... మోసం... వంచనా.. దేవుని పేరిట వ్యాపారం' అశోక్ విస విసా వెళ్లిపోయాడు.

నేను విస్తుపోయాను.

## 13. నీ వేలితో నీకంటిని పొడవడమంటే ఇదే!

నిన్ను పోలీస్ స్టేషన్ కులాగక పోతే, నేను శాంతమ్మనే కాను; చూడు నాతడాఖా!' అంటూ కొడుకును తీసుకొని వెళ్లి పోయిందామె.

ఆమె పదేళ్ల కొడుకు, పక్కింటి ఇద్దరమ్మాయిలు తమ ఇంటిముందాడుకొంటూ, అరచుకొంటూ, అంతస్తు క్రింది భాగంలో పార్కు చేసిన తన స్కూటరు మీద ఉమ్మివేస్తుంటే మందలించాడు శాస్త్రి. అంతకూ వినకపోతే చేయిపట్టుకొని లాక్కొని వెళ్లి ఎదురుగా ఉన్న వారింటి ముందు ఈ అబ్బాయిని వదలి పెట్టి వచ్చాడు. ఆ అబ్బాయి తల్లి ఇంటిమీదికి వచ్చి అరచి వెళ్లిపోయింది.

తాము కిరాయికున్న ఫ్లాట్ అది. మొత్తం మూడంతస్తులు. 12 ఫ్లాట్లు ఒకవైపు, మరోపన్నెండు ఫ్లాట్లు మరోవైపు; రెండూ ఎదురు బదురుగా ఉన్నాయి. క్రింది ఎనిమిదింటిలో ఓ మెకానిక్‌షాపు, ఓప్రింటింగ్ ప్రెస్సు, ఓచిన్న హోటల్, ఓఫైనాన్స్ కంపెనీ, ఓసైకిల్ షాపు, ఓ ఎలక్ట్రికల్ షాపు... ఇలా ఉంటాయి. మిగతా పదహారింటిలో కిరాయి దార్లుంటారు. ఓనర్స్ దగ్గరి ఇంటిలో ఉంటారు.

పైపోర్షనులో శాస్త్రి ఉంటాడు. అతనికి అటువైపు ఇటువైపు రెండు క్రిష్టియన్ కుటుంబాలుంటాయి. సరిగా ఎదురుపోర్షనులో శాంతమ్మకు అటు ఇటు కిరస్తానీలుంటారు. శాస్త్రి ఉన్న అంతస్తులో మరోహిందూ కుటుంబం, శాంతమ్మ ఉన్న వరుసలో ఓహిందూకుటుంబం ఉంటుంది గాని వారు ఎప్పుడుంటారో, ఎప్పుడువస్తారో, ఎప్పుడు పోతారో ఎవరికీ తెలియదు.

నాల్గు కిరస్తానీ కుటుంబాలు భజనలు చేయడం, పాటలు పాడడం, పెద్దగా అరవడం ప్రారంభించాయి. అంత పెద్దగా అరవకండి అని శాస్త్రి అంటే, నీఇష్టముంటే ఉండు లేకపోతే ఖాళీచేసి పో అన్నారు కిరస్తానీలు, పైగా ఇంకా పెద్దగా పాడడం, అరవడం, ప్రార్థన కూటములు నిర్వహించడం మొదలుపెట్టారు.

శాస్త్రి అధ్యాపకులు; విద్యార్థుల కొరకు పాఠాలు ప్రిపేరయ్యే ప్రశాంతత కూడ



ఆ ఇంటిలో లేకపోయింది. తనను అక్కడి నుండి పంపించి ఏదో ఓ కిరస్తానీ కుటుంబాన్ని తీసుకరావాలని వారు ప్రణాళిక వేసినట్లర్థమైంది శాస్త్రికి.

మాఇల్లు మా ఇష్టం; నీకిష్టం లేకపోతే చెవుల్లో రాళ్లు పెట్లుకో! పిల్లలు ఎక్కడైనా ఆడుకొంటారు; ఆడుకొన్నప్పుడు ఆరుస్తారు; చూడబుద్ధి కాకుంటే తలుపులు వేసుకో!.... " ఇలా ఉన్నాయి వారి మాటలు.

శాస్త్రి ఇంటి ఓనరుకు వారి అల్లరి గురించి చెప్పాడు. అతను వచ్చి మందలించి వెళ్లాడు. అయినా కిరస్తానీల అల్లరి తగ్గలేదు. పైగా అందరింటి తలుపులకు శిలువ స్టిక్కర్లు అతికించి, కరపత్రాలు పంచి, ఇంటిమీద ప్రార్థనా కూటములు నిర్వహించారు.

శాస్త్రి ఇక లాభంలేదని అక్కడికి దగ్గరగా ఉన్న హిందువాహిని వారి వ్యాయామశాలలో చేరారు. ఓనాడు అందులోని నలుగురు యువకులు వచ్చి కిరస్తానీలను హెచ్చరించి వెళ్లారు. ఆరోజు నుండి అరపుల పాటలు ఆగిపోయినై. ఆదివారం కూటములు బంద్ అయినై.

అయితే ఆరోజు నుండి వారు శాంతమ్మ ఇంటిమీద కన్ను వేశారు. కిరస్తానీ నాలుగు కుటుంబాల్లో ముగ్గురు నర్సులు, ఒకరు క్లర్కు. రెండుకుటుంబాల మగవాళ్లు మతప్రచారంచేసే జీతగాళ్లు. ఊరూరుతిరిగి కరపత్రాలు పంచడం, ఉద్యోగాలిప్పిస్తామనడం, మందులు మాకులు ఉచితంగా ఇవ్వడం ఇదీవారి పని. ఎక్కడన్నా ఒక గొఱ్ఱె దొరికితే దాని మెడన శిలువ గట్టడం ఇవే వారి నిత్యకృత్యాలు.

ఇప్పుడువారు శాస్రినేమి అనడం లేదు. వారు శాంతమ్మను పట్టుకొన్నారు. ఆమెకు చీరలిస్తున్నారు; మందులిస్తున్నారు. వారి పిల్లలకు చాక్లెట్లు ఇస్తున్నారు. అందరు కలిసి పిల్లల చేత శాస్త్రి ఇంటి ముందు గత మూడునెలలుగా అల్లరిచేస్తున్నారు.

పిల్లవాడి చేయిపట్టుకొని లాక్కొని పోయినందుకు ఇప్పుడు ఆమె తనను పోలీస్ స్టేషన్‌కు లాగేట్టున్నది. తానేమో అధ్యాపకుడు. ఈ గొడవల్లో ఇరుక్కోవడం ఇష్టం లేదు. శాస్త్రి వెళ్లి కొంతమంది యువకులను కలిశారు. అందులో శాంతమ్మ కులానికి

చెందిన అబ్బాయి అన్నాడు. ఆ అబ్బాయి వారినాన్న గారికి ఈ సంగతి చెప్పాడు. ఆ అబ్బాయి తండ్రి శాంతమ్మ భర్తను కలిశారు.

శాస్త్రిని అక్కడినుండి పంపించాలని, ఆయింటిలో తమకు చెందిన మరో కిరస్తానీ కుటుంబాన్ని చేర్చాలని ప్రణాళిక వేసి శాంతమ్మను అనుకూలంగా మార్చుకొన్నారని తెలిసింది. శాంతమ్మ పిల్లలకు చాక్లెట్లు, శాంతమ్మకు మందులు ఇస్తున్నారు.

మరి ఇప్పుడు శాంతమ్మ భర్తకు ఏమిచ్చి హిందుత్వం వైపుగా తిప్పుకోవాలి! విదేశీ కిరస్తానీశక్తులు హిందువులలో కొందరిని ప్రలోభాలకు గురిచేసి, వారిని హిందువుల మీదికే ప్రయోగించడమనేది నీవేలితో నీకంటినే పోడవడం కదా!

●





# 14. అంతులేని కథకు అంతమెప్పుడు?

ఇది ఇప్పటి మాట కాదు; స్వాతంత్ర్యోద్యమం నాటి మాట. అయితే ఇప్పటికీ కిరస్తానీ డాక్టర్లు, నర్సమ్మలు ఈ పద్ధతిని పాటిస్తూనే ఉన్నారు. నిజానికి ఇదొక పద్ధతి కాదు. తమ మత సంప్రదాయాల విషయంలో గట్టిగా నిలవని వారిని, కిరస్తానం వైపులాక్కొనే విషవ్యూహం. మతమౌఢ్యం పీకల దాకా ఎక్కిన ప్రతికిరస్తానీ, మరోమతస్తుణ్ణి మతం మార్చడానికి పన్నే షడ్యంత్రంలో, చేసే కుతంత్రంలో అంతర్భాగం.

అదో ఆస్పత్రి; అందులో ఓకిరస్తానీ డాక్టర్; కిరస్తానీ నర్సులు.

ఓరోజు రైతు రామన్న హాస్పిటల్‌కు వచ్చాడు; ముప్పయ్యేళ్ల రైతు; అతని వెంబడి భార్యలక్ష్మి. జ్వరముంది, కడుపునొప్పి. ఊళ్లో ఆయా మందులేవో వాడారు. నయం కాలేదు. ఎవరో చెప్పారు ఇంగ్లీషు మందులు వాడితే నయమవుతుందని.

ఇంగిలీసోడు 1857నుండి ఇక్కడ పాతుకపోయాడు. మదరాసు కింద ఉన్న కృష్ణా గుంటూరు జిల్లాల్లో భూములెన్నో సొంతం చేసుకొన్నాడు. చర్చీలు గట్టాడు. ఆస్పత్రులు పెట్టాడు.

1857నుండి 90 ఏళ్లుగా స్వాతంత్ర్య ఉద్యమం జరుగుతూనే ఉన్నది. అయితావాడి చర్చిభూములు ఎవరు లాక్కోలేదు. ఆస్పత్రుల కొరకు, విద్యాలయాలకొరకు ఆక్రమించిన భూములు సొంతంచేసుకోవాలని కానీ, జాతీయోద్యమ సంస్థల కొరకు వాటిని తీసుకోవాలని గాని ఎవరూ ప్రయత్నించలేదు. కారణం సత్యాగ్రహం బ్రిటిషు సర్కారు మీదనేగాని మతసంస్థలమీద, విద్యానిలయాలమీద, వైద్యసంస్థలమీద కాదు. అందువల్ల దురాక్రమణ భారతంలో వారిచేతుల్లో ఉన్న సంస్థల భూములు స్వాతంత్ర్యానంతర భారతంలోనూ వారి చేతుల్లోనే ఉన్నాయి. విద్యపేరిట, వైద్యం పేరిట మాయమాటలు చెప్పి అమాయకులైన హిందువులను మతాంతరీకరణ చేయడానికి ఇవి ప్రధాన కేంద్రాలుగా కొనసాగుతూనే ఉన్నాయి.

రామన్న కథ చూడండి!

లక్ష్మి, రామన్నను ఆస్పత్రిలో చేర్చింది. డాక్టరు గారు వచ్చి పరీక్షించారు. తీవ్ర విషజ్వరం అన్నారు.

'ఏం మందులు వాడారు' అడిగారు.

'విష్ణుకాంత వేర్లరసం' లక్ష్మిఅన్నది.

'ఎవడిచ్చాడు' అడిగాడు డాక్టర్

'రామాచారి, గుళికలు గూడా ఇచ్చాడు' అన్నది లక్ష్మి.

పల్లెటూరి బైతుగానికేంతెలుసు. విసుక్కొన్నాడు డాక్టరు, కోప్పడ్డాడు డాక్టర్.

అవుసలిరామాచారి వైద్యం వాళ్ల ఊళ్లో ఏబయియేళ్లుగా సాగుతుంది. తీసేసినట్టు ఇంతమాట ఇంతవరకెవ్వరు అనలేదు. కోపం వచ్చినా లక్ష్మి రామన్నలు దిగమింగుకొన్నారు.

ఆ తర్వాత డాక్టరు నీళ్లమందిచ్చాడు. మీ దేవుళ్లను తలచుకోండి అన్నాడు. రామన్న, శివ, రామకృష్ణ, అంజనేయా అని తలచుకొన్నాడు. డాక్టరు వెళ్లిపోయాడు.

నర్సమ్మలు వచ్చారు. పిచ్చిమందులు వేసుకొన్నారు; పిచ్చిదేవుళ్లను తలచుకొన్నారు. ఒకటికి పదిసార్లు ఆరోజంతా నర్సమ్మలు ఈమాటలే అంటున్నారు.

మరుసటిరోజు డాక్టరు వచ్చాడు.

'అదే! జ్వరం తగ్గలేదే!' మీరే దేవుణ్ణి తలచుకొన్నారు' అడిగాడు డాక్టర్. శివుణ్ణీ, రాముణ్ణీ, కృష్ణుణ్ణీ, అంజనేయుణ్ణీ' అన్నాడు రామన్న.

'ఈరోజంతా ఏసును తలచుకొమ్ము; ఆప్రభువు రేపే నీజ్వరం తొలగించును' అంటూ డాక్టరు మంచి ఇంజక్షనిచ్చాడు. నర్సును పిలిచి పాలూ పండ్లూ బ్రెడ్డు ఇవ్వుమన్నాడు.

నర్సులారోజు రామన్న నెత్తి దగ్గర ఐసు గడ్డలు పెట్టారు. మధ్యమధ్యన గోళీలు



వేశారు. విసనకర్రతో విసిరారు. పండ్లిచ్చారు, పట్టి పట్టి పాలిచ్చారు; బ్రెడ్డు తినిపించారు. మాటి మాటికి ఏసును తలచుకో... తలచుకో అని ఊదరగొట్టారు.

మరుసటిరోజు డాక్టరువచ్చాడు.

'ఆహా! అద్భుతముగా జ్వరము తగ్గిపోయినది. ఇదంతా ఏసుమహిమ' అనిరెండు చేతులు పైకెత్తి 'ఆమెన్' అన్నాడు. లక్ష్మి రామన్నలను అలాగే చేతులుపైకెత్తి ప్రభువును తలచుకొమ్మన్నారు. వాళ్లలాగే చేశారు. నర్సులూ డాక్టరు మురుసుకొంటూ వెళ్లిపోయారు.

ఆ తర్వాత రెండురోజులకు ఆస్పత్రిలో నుండి రామన్న లక్ష్మి బయటకు వచ్చారు. వారిని చూపిస్తూ డాక్టర్ ఓ ఫాదిరీతో చెబుతున్నాడు.

'చూడు ఫాదర్! వారికి మన ఏసు ప్రభువుపై విశ్వాసము ఏర్పడెను. మీరు వారిని అనుసరించుడు. వారు ఇంటికి చేరుకొనిన పిదప కలువుడు. బాప్తిస్మము ఇవ్వుడు. మతము మార్చుడు... నాకు రావలసినవి ముట్ట చెప్పుడు...' డాక్టర్లోనికి వెళ్లిపోయాడు. ఫాదర్ లక్ష్మి రామన్నలను అనుసరించాడు.

ఇది ఒకచోటి కథ కాదు! కిరస్తానీలున్న ప్రతి ఆస్పత్రిలో జరుగుతున్న కథ; అంతులేని కథ. ఎక్కడో ఒకచోట అంతం పాడాల్సిన కథ.



# 15. అహింసాదేవతా? విషకన్యా?

ఇప్పటికీ పదిహేనేళ్ల క్రితం మాట.

ఇందూరు జిల్లాలోని తాలూకా ఎల్లారెడ్డి గ్రామానికి అహింసామాత వచ్చింది. వచ్చింది అనే కంటే అవతరించింది అంటే ఇంకా అతుకుతుందేమో! ఎందుకంటే ఆమె దేవలోకం నుండి దిగివచ్చినట్లే ప్రచారం జరిగింది.

గాలిలో తేలాడుతున్న వేల కుచ్చిళ్ల గుంపులున్న పసుపు పచ్చచీర కట్టుకొన్న, చేతుల పొడుగు ఆరెంజ్ రంగున్న జాకెట్టు వేసికొన్న అందాల సుందరి ఊరివెలుపల అంబాసిడర్ కారు నుండి దిగింది. ఆమెతో పాటే వచ్చిన అలాంటి డ్రెస్సు వేసుకొన్న మరో పదహారు మంది యువతులు రెండు వ్యాన్ల నుండి సుతారంగా దిగారు. వారందరికీ స్థానిక తహసిల్దార్, సర్పంచ్ వాణిజ్య ప్రముఖులు స్వాగతం పలికి ఆ గ్రామంలోని లక్ష్మీ నృసింహాలయానికి తీసుకొని వచ్చారు. వారందరూ తెల్లటి పొడుగు పాటి బొట్లుకూడా పెట్టుకొని ఉన్నారు. వారి వెంబడే ఉన్న మరో పెద్ద వాహనం నుండి పదిమంది నడీడు పురుషులూ దిగి అనుసరించి వచ్చారు.

వీరందరికొరకు, పక్కనే కొత్తగా నిర్మింపబడి ఉన్న భవనం వసతికై ఇచ్చారు. ఆలయమంటపంలో అడుగు పెట్టారే గాని దైవదర్శనం చేసుకోకుండానే అందరూ కొత్తభవనంలోకి వెళ్లిపోయారు. వందలాది మంది అహింసామాత - ఆహింసామాత అని దండం పెడుతున్నారు. వారి వెంబడి వచ్చిన స్త్రీలు - పురుషులు జనంలో కలిసిపోయి అహింసామాత అనుకొన్న కోరికలు తీసుస్తుంది అంటూ అందరికన్నా ముందుగా దండం పెడుతున్నారు. వారిని మిగతావారు అనుసరిస్తున్నారు.

ఆరోజు సాయంకాలం ఆలయం పక్కనే ఉన్న హాలులో "ఆహింసామాత" ఆరాధనం జరిగింది. పత్రం పుష్పం ఫలం తోయం ఏవీ ఎవరూ తేవద్దన్నారు. నేను నిన్ను నమ్ముకొంటున్నాను దేవి అని దగ్గరికి వచ్చి దండం పెడితే చాలు, ఆయమ్మ 'అహింసామాత' అన్న పుస్తకం చేతిలో పెడుతుంది.

దాదాపు రెండు వందల మంది ఉన్నారు. మాత వెంబడి వచ్చిన వారు కొన్ని



భక్తిగీతాలు పాడారు. అందరినీ గొంతుకలిపి పాడుమన్నారు. పాటలన్నీ కిరస్తానీల బాణీల్లో ఉన్నాయి. అలా అరగంట గడిచింది.

ఆతర్వాత ఒక యువతి ముందుకు వచ్చి కొద్ది పాటి తమిళ ప్రభావమున్న తెలుగులో ఇలాపలికింది.

'అహింస అంబాళ్ అంటే మాత దేవతగా అవతరించినది. ఆమెకు అన్ని బాసలు వచ్చును. కేరళ నుండి ఆ తల్లి తమిళనాడు మీదుగా ఈ దేశంలోకి వచ్చినది. మొదటగా వెనుకబడ్డ తెలంగాణలోని మెదక్ జిల్లాలో ప్రవేశించినది. ఆజిల్లాలో అమ్మవారు మూడుచోట్ల దర్శనమిచ్చినది. అహింసామాత అయిన తనను, నమ్ముకొన్న వారి కష్టాలు తీరుతాయని ప్రవచనం పలికింది. అమ్మవారు తక్కువ మాట్లాడతారు. దీవెనలు మాత్రమే ఇస్తారు. మీకష్టాలు చెప్పుకోండి! వ్యక్తిగతముగా కలుసుకోండి! మీకోరికలు తీరుస్తారు... ఇప్పుడు అమ్మగారు మాటాడుతారు....'

అమ్మగారు నవ్వారు.. ఎంత బావుంది నవ్వు.... ఆ పలువరుస అద్భుతం... ఆ ముఖంలో ఏమా కాంతి... అది దేవతల కాంతి.. అహింసామాత దేవుని బిడ్డ.. మరోసారి, మూడోసారి, నాలుగోసారి, అయిదోసారి.. అలలు అలలుగా అమ్మగారు నవ్వారు. కూచున్న వారు పరవశించి పోయారు. అమ్మగారు పెదవి విప్పారు; ముత్యాల మాటల మూటలు దొరలినై. రతనాల పదాల కాంతులు పారినై.

"బిడ్డలారా! దైవభక్తులు కండి! దేవుడు దయామయుడు. ఆయన ధర్మమును మనమనుసరించవలెను. ఆయన దేనికీ పోరాటమూ - ఆరాటమూ వలదన్నాడు. పోరాటముల వలన - ఆరాటముల వలన మనుష్యుడు చెడిపోవునని ప్రభువు చెప్పెను. ఆప్రభువు మీకు చెప్పుటకు నన్ను పంపించెను.

ఈ దేశమున హింస పెచ్చుపెరిగినది. అందుకే ఇక్కడికి అహింసమాత వచ్చినది. ఈ దేశమున నరసింహుడు, రాముడు, కృష్ణుడు హింస చేసి లెక్కలేనంత మందిని చంపినారు. అన్నదమ్ములనే చంపుకొన్నారు. ఈ నేల రక్తముతో తడిసి పోయినది. ఒక్క ఏసు ప్రభువు మాత్రమే ఈ నెలను రక్షించువాడు. ఆయన అహింసామతమునే వ్యాపింపచేయుటకు నన్ను పంపించెను...'

'అయితే నీవు కిరస్తానీవా!...' ఉపన్యాసం మధ్యలో డ్రిల్లుమాస్టరు విశ్వనాథం ప్రశ్న .... కంఠం ఖంగునమ్రోగింది.

సభ అంతా నిశ్శబ్దం.. అహింసామాత నవ్వుతున్నది. చేయెత్తి ఆశీస్సులిస్తున్నది. ఆమె వెంబడి వచ్చిన వారెవరేమీ అనడం లేదు. ఒకరు విశ్వనాథాన్ని ఫోటో తీశారు. మరొకరు ఆయన మాటల్ని రికార్డు చేస్తున్నారు.

"... అందుకే హిందూ దేవుళ్లు హింస చేశారంటున్నావ్. హిరణ్యకశ్యపుడు దేవతలెందరినో హింసించి చంపాడు. మున్యాశ్రమాలు నాశనం చేసి వారిని వధించాడు. చివరకు తన కొడుకు ప్రహ్లాదుణ్ణి హింసించాడు; చంపే ప్రయత్నంలో తానే నరసింహస్వామి చేతిలో చచ్చాడు.

శ్రీరాముని ధర్మపత్ని సీతమ్మను రావణుడపహరించాడు. అందుకే రాముడతణ్ణి సంహరించాడు.

పాండవులనూ వారి భార్య ద్రౌపదిని దుర్యోధనుడు అష్టకష్టాలు పెట్టాడు. వారి భూభాగాలనాక్రమించాడు. అందుకే శ్రీకృష్ణుడు పాండవుల పక్షం వహించి కౌరవసంహారానికి మార్గదర్శనం చేశాడు.

రెండువందల సంవత్సరాలు ఈదేశాన్ని పరిపాలించిన క్రైస్తవ హింసోన్మత్త పిశాచాలు మాభగత్సింగు, రాజగురు, సుఖదేవ్, ఆజాద్, అల్లూరిసీతారామరాజు, గోండుభీము, నేతాజీలను చంపి రక్తం త్రాగినై. స్వాతంత్ర్యోద్యమంలో మొత్తం ముప్ఫయి లక్షల మంది హిందువులను క్రైస్తవులు చంపారు...

అది హింస కాదా చెప్పు సమాధానం.. రామకృష్ణులు చేసింది ధర్మ యుద్ధం. కిరస్తానీలు చేసింది ధర్మయుద్ధామా! చెప్పు... నవ్వకు.. వేశ్యముండలా నవ్వి జనాల్ని ఆకర్షించకు... నాకు సమాధానం కావాలి.." విశ్వనాథం గట్టిగా అన్నాడు.

ఈ రోజుతో సభచాలింతము; రేపు సమాధానము లివ్వబడును.." అహింసా మాత వెంబడి ఉన్న ఒక పురుషుడన్నాడు. అందరూ వెళ్లి పోయారు. అందరితో పాటే విశ్వనాథము వెళ్లిపోయాడు.

విశ్వనాథము విశ్వహిందుపరిషత్ కార్యదర్శి అనీ, ఆయన ఈ విషయమై యువకులతో చర్చిస్తున్నాడని అహింసామాతకు తెలిసింది. ఆ రోజు రాత్రికి రాత్రే ఆ మాత ఆమె అనుయాయులు మరోచోట అవతరించుటకు వెళ్లి పోయారు. వారు సమాధానములు చెబుతానన్న రోజు ఇంతవరకు మళ్లీ రాలేదు.



# 16. వేటగాని గురిలో ఎందరు కురుమన్నలో!

'ఈ కాగితాలు ఏరి, ఈ పాలిథిన్ పేపర్లు ఏరి తీసుకపోయి ఇస్తే, వాడెంత ఇస్తున్నడు' అడిగాడు పన్నెండేళ్ల చంద్రన్న.

'రెండ్రూపాయలు' అన్నాడు దీనంగా ముఖం పెట్టి కురుమన్న.

'అరేయ్ రెండ్రూపాయలతో బతుకెట్లా ఎళ్లుతుందిరా... నేనో ఉపాయం చెబుతా నావెంటరా' అన్నాడు చంద్రన్న.

చంద్రన్న అదివరకు కూడా తనలాగే కాగితాలేరి, పాలథిన్ పేపర్లేరి, దొరికిన పాతసామాను ప్రోగుచేసి సంచి నింపుకొని బతుకు వెళ్లదీశాడు. తన కంటె వాడు రెండేండ్లు పెద్ద, గత ఆరునెల్లుగా ఈ పని మానేశాడు. ఎక్కడున్నడో! ఏం చేస్తున్నడో!

శుభ్రంగా ఉన్న బ్లూరంగు పాయింటు, గీరల బుషర్టు, ముఖం నున్నగా, నెత్తినున్నగా... అంతా నున్నగా ఉన్నాడు. నెలకు కనీసం ఓ అయిదారొందలన్నా సంపాదిస్తేగాని ఇంతమాత్రం ఉండడానికి వీల్లేదు. ఏదైనా షాపులో పనిచేస్తుండాలె, అనుకొంటూనే చంద్రన్నను అనుసరించాడు కురుమన్న!

'ఒరేయ్ కురుమన్నా! ఈ రెండు రూపాయలు తీసుకో, ఆ గోనెసంచి ఖరీదు అయిదు రూ॥లు తీసుకో! ఆ సంచి ఏరిన పాత సామాను అక్కడే చెత్తకుండి దగ్గర పారవెయ్" అన్నాడు చంద్రన్న.

కురుమన్న ఏడు రూపాయలు తీసుకొని ఆగోనేసంచిని సామానుతో పాటు చెత్త కుండీలో వేశాడు. చంద్రన్నను అనుసరించాడు.

ఇరువురూ ఓ వీధిలోని విశాల ఆవరణ ఉన్న ఓ ఇంటిలో అడుగు పెట్టారు. ఆ ఇంటి పక్కకే పెద్దహాలున్నది. ఆ హాలులో తన లాంటి వారే ఓ పదిమంది ఉన్నారు.

కురుమన్నను ఓ పెద్ద నల్లా దగ్గరికి తీసుకొని వెళ్లి చంద్రన్న స్నానం చేయించాడు. లక్స్ సబ్బుతో [illegible] శరీరమంతా

తుడిచాడు. ఆ తర్వాత ఓ నీలిరంగు నెక్కరిచ్చాడు. గీరల అంగీ ఇచ్చాడు. హాలు పక్కకే ఉన్న వంటశాలలోకి తీసుకువెళ్లాడు. కోడి మాంసంతో కడుపునిండా భోజనం పెట్టించాడు. పాన్ వేసుకోమన్నాడు. బీడీ సిగరెట్లలో ఏదిష్టముంటే అదీ కాల్చమన్నాడు. ఆ తర్వాత హాల్లోకి తెచ్చి అందరితో పాటె ఓ పెద్ద టీవీసెట్ ఎదురుగా కూచోబెట్టాడు. చిరంజీవి ఫైటింగ్ సినిమా పిల్లలందరు ఎగబడిచూస్తున్నారు. మధ్యమధ్యన అందరూ కేరింతలు వేశారు. డిషుం డిషుం అన్నారు.

మూడు గంటల సినిమా అయిపోయింది.

చంద్రన్న కురుమన్నను తీసుకొని ఆ హాలు పక్కనే ఉన్న ఇంట్లోకి తీసుకెళ్లాడు. అక్కడ పొడుగుపాటి తెల్లంగి వేసుకొన్న పెద్ద మనిషి ఉన్నాడు. ఆయన తన పేరు దయాసాగర్ అని చెప్పాడు. స్ట్రీట్ చిల్డ్రన్స్‌ను తీసుకొని వచ్చి వారికి కడుపునిండా అన్నం పెట్టడమే తన ధర్మం అన్నాడు ఆయన. ఆ ప్రభువు తనకెంతో ధనమిచ్చాడని, విదేశాల నుండి కూడా ఎంతో ధనం వస్తుందని, ఈ దేశంలోని నిరుపేదలను ఆదుకోవడమే తనజీవిత ధ్యేయమని చంద్రన్నను కురుమన్నను తీసుకొనివెళ్లి, తన ఇంట్లో రంగురంగులబల్బుల మధ్య మెరిసిపోతున్న పన్నెండు అడుగుల ఏసు ప్రభువుకు మొక్కించాడు. 'ఇక్కడ తినండి; బయట తిరగండి; మీ ఇష్టంఉన్న పనిచేయండి; ప్రభువు మీకు అన్నం పెట్టి, మంచి బట్టలిచ్చి, ఆశ్రయమివ్వవలసినదని నన్ను పంపించాడు'' అన్నాడు దయాసాగర్.

కురుమన్న అవాక్కయి పోయాడు. ఆ రోజునుండి అక్కడే తింటున్నాడు; హాల్లో టీ.వి. చూస్తున్నాడు. దగ్గరలో ఉన్న ఏదైనా సినిమా టాకీసుకు వెడుతున్నాడు; అక్కడ సినిమాలు చూస్తున్నాడు. దయాసాగర్ ఇచ్చిన ఏసు పుస్తకాలు పంచి వస్తున్నాడు. క్రీస్తు పుస్తకాల పంపిణిలో అనుకోకుండానే పదేళ్ల కురుమన్న ఇరుక్కొని పోయాడు.

ఓ రోజు ఈ పుస్తకాలు పంచుతున్నాడు. వారి ఊరి లంబాడా గాంశీరాం కుర్మన్నను చూశాడు. గాంశీరాం ఆటోనడుపుతున్నాడు. ఆటోలో ఎక్కించుకొన్నాడు. "నువ్వు పట్నం పారిపోయి వచ్చినంక మీ రెండెడ్లా మీనాన్న అమ్మేశాడు. మీతాత మంచం పట్టాడు. ఇప్పుడు పొలం బీడువడిపోయింది. ఇలాగా ఊరిలో అందరి



పొలాలు బీడువడితే పంటవెవరు పండిస్తరు. నేను సూడు వానలు పడగానే విత్తనం వేసి వస్తా! పొలంలో పంటలు పండించకపోతే ఈ దేశమేమైపోతది. నువ్విట్ల కిరస్తానీ మతం పుస్తకాలు పంచితే వాళ్లింత కూడువెట్టి ఉంటరు... అంతేనా అడిగాడు గాంశీరాం.

'అవును' అన్నాడు కురుమన్న.

'నీమతాన్ని గురించి నీవు ఎన్నడన్న ఇట్ల పుస్తకాలు పంచినవా' అడిగాడు గాంశీరాం.

'మనల్ని బానిసోల్లుగా చేసి ఏలినోని మతాన్ని ప్రచారం చేయడం తప్పున్నర..... ఇట్లా సేస్తే మల్లా మనం బానిసలమైపోం....' అన్నాడు గాంశీరాం.

అంతే తనచేతులోని కిరస్తానీల పుస్తకాలను బురద గుంటలో వేసి గాంసీరాం వెంబడి వెళ్లిపోయాడు కురుమన్న, చంద్రన్న మాత్రం మరోకురుమన్నను పట్టుకోడానికి ఇంక తిరుగుతూనే ఉన్నాడు.



# 17. పకడ్బందీ విషవ్యూహం

సికింద్రాబాదులో డి.ఇ.ఓ అండర్లో నడుస్తున్న తెలుగు మీడియం పాఠశాల. ఆ పాఠశాలలో కూలీనాలీ చేసుకొనే వారి పిల్లలు, రిక్షా పుల్లర్ల సంతానం, కొన్ని మధ్యతరగతి కుటుంబాల వారి బాలబాలికలు మాత్రమే చేరుతుంటారు.

పాఠశాల గేటుదగ్గర ఓ ఇరవైయేళ్ల యువకుడు పుస్తకాలను (బుక్‌లెట్సును), పంచుతున్నాడు. ఆ పాఠశాలలోని అధ్యాపకుడు శాస్త్రి ఇది చూశాడు. వెళ్లి ఆ యువకుని పక్కన నిలబడ్డాడు. అతను తత్తరబిత్తరయిపోయి సైకిల్‌పై ఉడాయించే ప్రయత్నం చేశాడు.

'సరే, ఎట్లాగూ వెళ్లిపోక తప్పదు గాని - నువ్వు హిందువై యుండి ఎందుకీ కిరస్తానీ పుస్తకాలను ఈ ఆయిదారేడు తరగతుల పిల్లలకు పంచుతున్నావు...' అడిగాడు శాస్త్రి అతని సైకిల్ కొమ్ము పట్టుకొని.

'నెలకో పన్నెండు వందలిస్తరు సార్! స్కూళ్ల దగ్గర, బస్సుస్టాండుల దగ్గర, చౌరస్తాలల్లో; ఈ సిటీ చుట్టుపక్కల ఉన్న గ్రామాలల్లో పంచాలిసర్! అన్నాడు" ఆ యువకుడు.

'ఇవి పంచే ఇంత సమయంలో నువ్వు ఏపని చేసినా పన్నెండు వందలు సంపాదించుకోవచ్చు గదా!' అడిగాడు శాస్త్రి.

'మరి పని చేసుకొని బతుకుపో! మనల్ని మనదేశాన్ని బానిసలుగా మార్చి వర్ణవివక్షతో పరిపాలించిన ఈ విదేశీ నరహంతకుల మతాన్ని గూర్చి ప్రచారం చేయకు! మరోసారి ఈ దేశాన్ని ఆక్రమించాలనే క్రైస్తవుల కుతంత్రంలో అంతర్భాగంగానే వారి మత ప్రచారం ఈ దేశంలో సాగుతున్నదని గుర్తుపెట్టుకో!' .. అన్నాడు శాస్త్రి సైకిల్‌ను వదలివేస్తూ.

'అర్థమైంది సర్!' అంటూ ఆ యువకుడు వెళ్లిపోయాడు.

అప్పటికింకా ప్రార్థనా ఘంట కొట్టలేదు. శాస్త్రి నేరుగా 4,5,6,తరగతుల



బాలబాలికలున్న గదుల్లోకి వెళ్లాడు. అతను పంచిన అరవై పుస్తకాలను కలక్ట్ చేసుకొన్నాడు. ఒకరిద్దరమ్మాయిలను ఇంటర్వ్యూ చేశాడు. కొన్ని కొత్త విషయాలు తెలిశాయి.

ఆ పుస్తికలన్నీ కిరస్తానీ తెలుగులో ఉన్నాయి. (ఉచ్చరించేప్పుడు ఓ ప్రత్యేకత ఉంటుంది; అనువాదం కూడా ప్రత్యేకంగా ఉంటుంది. ఆ ప్రత్యేకత ఉన్న తెలుగునే కిరస్తానీ తెలుగంటారు) భాష సరళంగా ఉంది. ఏసుక్రీస్తు రోగాలు దూరం చేసిన కథలు, గొర్రెల కాపరులను దగ్గరికి తీసికొన్న సంఘటనలు ఆ పుస్తికల్లో ఉన్నాయి. పుస్తకాల చివరన ఒక కూపన్ ఉంది. ఆ కూపన్ చించి అడ్రస్ వ్రాసి పోస్టులో వేస్తే వారికి ఇంకా ఎన్నో మంచి కథల పుస్తకాలు ఉచితంగా పోస్టులో పంపిస్తారనే సూచన కూడా ఉంది.

'దొంగనాయాల్లారా!' అనుకొన్నాడు శాస్త్రి.

ఆ మరుసటిరోజు హెడ్‌మిస్ట్రెస్ శాస్త్రిని తన గదిలోకి పిలిచింది.

'మీరు 4,5,6 తరగతుల్లోని పిల్లలందరికి హిందూమతం గురించి చెబుతున్నారట!" అడిగింది సూటిగా.

'నా తెలుగు పాఠమే చెబుతున్నాను' అన్నాడు శాస్త్రి

'అందరూ తప్పకుండా బొట్టు పెట్టుకొని రావాలని అన్నారట'

'బొట్టెందుకు పెట్టుకోవాలని ఆపిల్లలు అడిగారు; చెప్పాను. మీ సిస్టర్ ఇంగ్లీషు టీచర్‌గారు బొట్టు పెట్టుకోవద్దు; ఎందుకు పెట్టుకోవాలో చెప్పండి అని పిల్లల్ని అడిగారట. పిల్లలు నన్ను అడిగారు. నేను చెప్పాను. మీరు పెట్టుకోవద్దు అని ఎందుకంటున్నారు.'

'నేను అన్నానా!'

'మీరు కాకపోతే మీ సిస్టర్!' మీరు చేస్తున్నారు మత ప్రచారం! నేను చేస్తున్నది ఎవరి మతసంప్రదాయాలను వారు పాటించమని చెప్పడం! మీరు విషం కక్కుతున్నారు. నేను అమృతం పంచుతున్నాను...' అంటూ చరా చరా వెళ్లిపోయాడు శాస్త్రి.

ఆ తర్వాత ఆ కిరస్తానీ పెద్ద పంతులమ్మ శాస్త్రి లేటుగా రాకున్నా లేటు మార్కు వేయడం, ఒకరిద్దరు అమ్మాయిల తల్లిదండ్రులను మంచి చేసుకొని తిట్టించడం, పై అధికార్లకు ఈయన సరిగా పాఠాలు చెప్పడం లేదని వ్రాయడం.. ఇలాంటివన్నీ వరసగా చేసింది.

శాస్త్రి ఇక సహించలేకపోయాడు; నేరుగా డి.ఇ.వో దగ్గరకు వెళ్లాడు. ఆ అరవై పుస్తికలు ఆయన ముందుపెట్టి, ఆపాఠశాలలోని ముగ్గురు కిరస్తానీ టీచర్సు ఏవిధంగా మతబోధలు చేసి విద్యార్థినీ విద్యార్థుల మనస్సులలో కల్మషాన్ని నింపుతున్నారో వివరించాడు.

శాస్త్రి ప్రయత్నానికి ఫలితం వెంటనే వచ్చింది. ఆహెడ్‌మిస్ట్రెస్ బదిలీ అయింది. కాని కిరస్తానీ ప్రచారక నాయకులు, రాజకీయ నాయకులను పట్టుకొని ఆమెను అక్కడికే తెచ్చారు. శాస్త్రి డి.ఇ.వో.ను మళ్లీ కలిశాడు.

'ఈ దేశంలో ఓట్లకొరకు లాలూచీపడే నాయకులు న్యాయం జరగనివ్వరు, ఆమె బదిలీ కాదు, ఇప్పుడు నిన్నే బదిలీ చేయాల్సివచ్చింది చూడు' అన్నాడు డి.ఇ.వో. శాస్త్రి చేతిలో ట్రాన్స్ఫర్ ఆర్డర్ పెడుతూ.. గాంధీ నెహ్రూల పటాల దిక్కు కోపంగా చూస్తూ.....

●





# 18. డబ్బే ప్రధానమైతే అమ్ముకోని దేమిటి?

వకుళ బస్సుస్టాండులో నిలుచున్నది. సికింద్రాబాదు నుండి ఉప్పల్ వైపుగా వెళ్లే బస్సు ఎక్కడానికి వీలులేనంత రద్దీగా ఉండడంతో మరోబస్సు కొరకు ఎదురు చూస్తుంది. ఈ లోగా తనకు తెలిసిన మనిషి.. ఆమె.. సరోజినీ నవ్వుతూ తనవైపే రావడం వకుళ చూచింది.

అరే! సరోజిని, ఇలా మారిందేంటి! ముఖాన బొట్టు లేదు; కళ్లకు కాటుకలేదు; చేతులకు గాజులు లేవు. కాళ్లకు మెట్టెలు కూడా ఉన్న దాఖలాలు లేవు. ఈమె భర్త..? అమంగళం శమించు గాక!

అయిదేళ్ల తరువాత కనిపించిన సరోజిని నవ్వుతూ తన దగ్గరికి వచ్చి నమస్కరించింది. వకుళ ప్రతి నమస్కారంచేసింది.

మర్యాదలు ముగిసిన తర్వాత 'మళ్లీ ఎప్పుడైనా మండలం చేశారా"! అడిగింది వకుళ. సరోజినీ తాను ఐదేళ్ల క్రితం యాదగిరి గుట్టలో నలభైరోజుల దీక్షతో గడిపారు. రోజూ ఉదయం, సాయంకాలం తలారస్నానం చేసి, గుడిచుట్టూ నూటెనిమిది సార్లు ప్రదక్షణం చేసే వారు; ఆ తర్వాత రెండు పర్యాయాలు గుడి ప్రాంగణంలో కూచొని గంటసేపు ధ్యానంచేసేవారు. దైవసన్నిధిలో సేవా కార్యక్రమాల్లో పాల్గొనేవారు; కుంటికీ గుడ్డికీ పైసా పరకా దానంచేసేవారు; రోజూ విష్ణు సహస్రనామ పారాయణంతో, గీతా పారాయణంతో కాలం గడిపేవారు; భాగవతం శ్రవణం చేసేవారు; లక్ష్మీనృసింహపురాణం చదివేవారు; ఆ దేవుని పేరిట వచ్చిన లక్ష్మీ నరసింహ శతకాలను పఠించేవారు.

ఇలా మండలం కలిసి చేశారు. అనుకోకుండా యాదగిరి గుట్ట మీద ఒకేరోజు ప్రారంభించి చివరి వరకు కలిసి ఒకరికొకరు తోడుగా ఉన్నారు. వకుళకు తెలిసిన ఓ పూజారి రికమండేషన్‌తో లభించిన గదిలో ఇద్దరూ ఉన్నారు. మండలం ముగిసిన తర్వాత హైదరాబాదులో ఇద్దరూ మళ్లీ కలుసుకోవాలని చిరునామాలు తీసుకొన్నారు. కాని కలుసుకోలేక పోయారు.

సరోజిని వయస్సు నలభై[illegible]చుగా అంతే.

ఆమెభర్త ఆనారోగ్యంగా ఉన్నాడు. హైదరాబాదులో దాదాపుగా కలిసిపోయిన అవుట్‌స్కర్ట్స్‌లో ఓగది కిరాయికి తీసుకొని ఉన్నారు. అతను టైలర్. ఓదుకాణంలో పనిచేసేవాడు. క్షయ కారణంగా పనికి పోకుండా ఇంటి దగ్గరే ఉంటున్నాడు. ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టి చనిపోగా, చివరగా ఓ అమ్మాయి మిగిలింది. ఆ అమ్మాయికి అప్పుడు అయిదేళ్లు, ఆపాపను తమ తల్లిగారింటిలో ఉంచింది. ఓబిస్కట్ ఫ్యాక్టరీలో పనిచేస్తుంది సరోజిని. ఆరోజుల్లో నెలకు ఆరువందల సంపాదన ఉండేది.

"మనం ఆ మండల పూజ తర్వాత మళ్లీ కలుసుకోలేదు...' అంది వకుళ.

'మిమ్మల్ని అయిదారుసార్లు ఇదే బస్సు స్టాండులో దూరం నుండి చూశాను. మీరు పనిచేస్తున్న స్కూలుకు వచ్చి కలుద్దామనుకొన్నాను. వీలుకాలేదు...' అన్నది సరోజిని.

'ఇప్పుడు బిస్కట్ల ఫ్యాక్టరీలోనే ఉన్నారా!'

'లేదు... ఈ పని చేస్తున్నాను..' ఓ చిన్న పుస్తిక (బుక్‌లెట్) వకుళ చేతిలో పెట్టింది. దానిపై నున్న శీర్షిక 'ప్రభువును నమ్ముకో'.

బిత్తరపోయి చూచింది వకుళ.

నేను నమ్ముకొని ఇదే ప్రచారం చేస్తున్నాను; నెలకు రెండువేల రూ॥లు సంపాదిస్తున్నాను. ఏ ఒక్కరిని కిరస్తానీగా మార్చినా పదిహేనువేల రూ॥లు ఇస్తున్నారు. ఉదాహరణకు నిన్ను నేను మార్చినా అనుకో! నాకు పదిహేనువేలిస్తారు. అందులో నేను నీకు సగం ఇస్తాను...' అంది నవ్వుతూ సరోజిని.

'అలాగా! నేను మరోసారి మండలం చేశాను' అన్నది నిర్లిప్తంగా వకుళ.

'నాకు ఆ నమ్మకం పోయింది...' పెదవి విరచింది సరోజిని.

'ఈ నమ్మకం వల్లనే నీకు ఈ డబ్బులు వస్తున్నాయా!'

'అవును'

'నీవు ప్రచారం చేయకున్నా డబ్బులు ఇస్తారా!'

'ఇవ్వరు'... ఇది ఉద్యోగం కదా! తప్పకుండా ప్రచారం చేయాలి, హిందువులను మతం మార్చాలి...'

'నమ్మిచేస్తున్నావా! డబ్బుకొరకా!'



'రెండింటికోసం...'

'డబ్బివ్వకున్నా ప్రచారం చేస్తావా!'

'డబ్బులివ్వకపోతే, సంపాదనలేకపోతే ఇల్లెలాగడుస్తుంది'

'మరి మీ ఆయనకు బాగయిందా!'

'ఆయనపోయారు; ఆయనపోకముందే నాకోనర్సమ్మతో పరిచయం ఏర్పడింది. నేను బాప్తిస్మం ఆమె ద్వారానే తీసుకొన్నాను. నేను ప్రచారం మొదలుపెట్టాను. మావారు పోయారు. మాఅమ్మదగ్గరున్న అమ్మాయి ఇప్పుడు నాదగ్గరే ఉంది. అది ప్రయివేటుగా చదువుతుంది. టైలరింగ్ పని నేర్చుకొంది...' అంది తలక్రిందికి వంచుకొని.

'అయ్యో! మీవారు పోయారా!.... పాపం... మండలం చేయడం వల్ల పోయారనుకొంటున్నావా!... మతం మార్చుకోవడం వల్ల పోయారనుకొంటున్నావా' సూటిగా అడిగింది వకుళ.

మాటాడలేదు సరోజిని.

'ఆయన జబ్బుతో ఆయన పోయారు; పిచ్చి నమ్మకాలేం పెట్టుకోకు! మీ అమ్మానాన్నల మతానికి ద్రోహం చేయకు! ఈ విదేశీ మతాన్ని వదలిపెట్టెయ్. నీతల్లిదండ్రులెవరని చెప్పుకొంటావో ఆలోచించు. నీఝాన్సీ లక్ష్మీబాయిని క్రూరాతి క్రూరంగా చంపిన కిరస్తానీ సైతాన్ల మతాన్ని నీవు స్వీకరిస్తావా! అదీ డబ్బు కొరకు! డబ్బు కొరకు మతం మారడం దాదాపు ఒళ్లు అమ్ముకొని బ్రతకడంలాంటిది! పైగా నాలాంటిదాన్ని మార్చడానికి ప్రయత్నిస్తావా! ఈ దేశాన్ని మతం పేరిట ఆక్రమించుకోవాలని అనేక కుతంత్రాలు పన్నుతున్న విదేశీ కిరస్తానీల అడుగులకు మడుగులొత్తుతావా! ఆలోచించు...' అంటూ అప్పుడే వచ్చిన బస్సెక్కి, గాలిలో చేతినాడించి వెళ్లిపోయింది వకుళ.

సరోజినీ బిత్తరపోయి అలాగే నిలబడిపోయింది. తన కూతురు హైందవి చుట్టూరా రాబర్ట్ ఎందుకు తిరుగుతున్నాడో అర్థమయింది. ఆమెకళ్ల ముందు పీటర్ సుబ్బయ్య తిరిగాడు. తనబ్యాగులోని పుస్తకాలన్నీ మోరీలోకి విసరేసి ఉప్పల్ బస్సెక్కింది సరోజిని. ●

# 19. నీకు ఇద్దరు మొగుళ్లున్నారా?

ఆ అమ్మాయి హాస్టల్లోకి వెడుతుంది. ఎదురుగా ఎప్పుడూ మాటలతో హింసించే ట్యూటర్ వస్తోంది. ఆమెను తప్పుకోవాలని ఎంత ప్రయత్నించినా కళ్లల్లో పడనేపడింది.

ఈ అమ్మాయి 'గుడ్ మార్నింగ్ మేడమ్' అంది. ఆ ట్యూటర్ ఎగాదిగాచూచి 'ఏంటే రెండు బొట్లు పెట్టుకొన్నావు నీకిద్దరు మొగుళ్లున్నారా?' అంది మూతి ముప్పయి వంకర్లు దిప్పి సాగదిస్తూ.

ఆమె మాటల హింస ఈ అమ్మాయికి తెలుసు. ఓనాడు చీరగట్టుకొని వెడుతుంటే 'ముసలమ్మవా' అన్నది. మరోనాడు కొబ్బరికాయ తీసుకొని గుడికి వెడుతుంటే 'ఎవణ్ణి చూడడానికే' అన్నది. ఇంకోనాడు తండ్రికి రాసిన ఉత్తరం పోస్టు చేసి వస్తుంటే 'బాయ్ ఫ్రెండ్‌కా' అని అడిగింది. మరోరోజు ఓ డాక్టర్ గారికి 'మందుసీసా' అందిస్తుంటే సీసాలందించే అనుభవమే ఉందా సీసాలు గ్లాసులో పోసే అనుభవమూ ఉందా అని అడిగింది. ఇంకోరోజు రోగి పడుకొన్న బెడ్ అస్తవ్యస్తంగా ఉంటే సర్దుతుంటే ఓబెడ్ నలిగినా, గుర్తుపట్టరానంత నీట్‌గా సర్దే నైపుణ్యం సంపాయించావన్నమాట' అని కిసుక్కున నవ్వింది.

ఇక ఈరోజేమో ఇంత పెద్ద మాటు. తాను ఈ సికింద్రాబాదు నర్సు ట్రెయినింగ్ స్కూల్లో చేరినప్పటి నుండి ఇలాంటి సూటిపోటి మాటలకు గురవుతుంది. హిందూ ట్రెయినీస్ నందరినీ ఇటువంటి మాటలతోనే ఆమె హింసిస్తుంది.

ఈస్కూలు ప్రారంభమైనప్పటి నుండి హిందూ ముస్లిం క్రిష్టియన్ విద్యార్థినులందరినీ ఉదయమే ఒక దగ్గర కూచోబెట్టి బైబిల్ ప్రార్థన చేయించేవారు. కిరస్తానీ గీతాలు పాడించేవారు. సరిగా ఒక ఏడాది క్రితం ప్రార్థన ప్రారంభానికి ముందు ఈ అమ్మాయి అందరి చేత "ఓం భూః భువః సువః...." అంటూ గాయత్రి ప్రార్థన చేయించింది. నన్ కూడా అయిన ఈ ట్యూటర్ ఆగ్రహోదగ్రురాలయ్యింది. ఈ అమ్మాయిని చెడామడా తిట్టింది. ప్రిన్సిపాల్‌కు చెప్పినీకు రెస్టికట్ ఇచ్చి



పంపిస్తానన్నది. నీవు తిరుగుబోతువని పదిమందికి చెబుతానన్నది. మీనాన్నగారి దగ్గరికి స్పెషల్ మెసెంజర్ను పంపిస్తానన్నది. నానాహంగామా చేసింది.

'ఏం మీ కిరస్తానీ ప్రార్థన చేయొచ్చుగానీ, హిందూ ప్రార్థన చేస్తేనే తప్పొచ్చిందా! గుంపులో నుండి ఓ విద్యార్థిని అన్నది.

'ఈమాటన్న లం...ముండ ఎవతి' పెద్దగా అరిచింది ట్యూటర్.

'హిందూ ట్రెయినీస్ నందరినీ ఫెయిల్ చేయిస్తా! ఈ 1999వ సం॥లో ఒక్క హిందూపిల్ల కూడా పాస్‌కాదు! మైండిట్!...'నానాయాగిచేసింది; పిచ్చికుక్కయిపోయింది.

ఆ తర్వాత, రేపటి నుండి ఎవరూ ఏ ప్రార్థన చేయరాదని పెద్దగా అరచివెళ్లిపోయింది. ఆరోజు నుండే కిరస్తానీ ప్రార్థనలాగిపోయినై.

అప్పటినుండే ఈ నన్ ట్యూటర్ హిందూ ట్రెయినీస్ మీద పగబట్టింది. ఒక అమ్మాయి వివేకానందుని 'బొమ్మ', పెట్టుకొంటే తీసి విసరి కొట్టింది. రోగుల దగ్గరికి ఫాదరీలను తానే తీసుకొని వచ్చి ప్రార్థనలు చేయించింది. ప్రతిగదిలో క్రీస్తుబొమ్మను పెట్టించింది. అదివరకే ఉన్నచోట మరోబొమ్మను కూడా చేర్పించింది. హిందూ శిక్షణార్థులు హాస్టల్ దగ్గరే ఉన్న దేవాలయానికి కూడా వెళ్లకుండా నిర్బంధించింది. హాస్టల్ దాటితే చాలు ఎవరితోనే సంబంధం అంటగట్టి మాటాడ్డం మొదలెట్టింది. మతం పిచ్చి లేచిన సైతాన్‌లా స్వైరవిహారం చేస్తూ ఈరోజు ఇంతపెద్దమాటన్నది.

ఈ అమ్మాయి దేవాలయం వెళ్లింది. అక్కడ కుంకుం పెట్టుకొంది. అదివరకే ఉన్న విభూతి బొట్టు మీద తిలకం. ఎవరినైనా ఆశీర్వదించేప్పుడు పదిబొట్లూ పెట్టవచ్చు. అది ఆశీర్వాదమే! కానీ మతం మదం ఎక్కిన కళ్లకు అంతరార్థం తెలిస్తే కదా!

ఈడ, పింగళ, సుషుమ్న నాడులు కలిసే కనుబొమల మధ్య తిలకం పెట్టడం వెనుక ఉన్న ఆరోగ్య సూత్రం అర్థం చేసుకొమ్మందాం! కిరస్తానీ అసహనత్వానికి చరమగీతం పాడకుంటే, ఎవరు త్రవ్వుకొన్నగోతిలో వారే పడతారని హెచ్చరిద్దాం! మత సామ్రాజ్యవాద దురహంకారం ఇంకానా! ఇకపై చెల్లదని బుద్ధి చెబుదాం!

## 20. సైతాన్ గోబ్యాక్! ఈకథవిన్నారా!! కన్నారా!!!

వనజ శరీరం కాలిపోతుంది, పిల్ల ఒకటే మూలుగుతుంది; ఆమె తండ్రి వ్యవసాయదారుడు; పైగా ఆ ఏరియాలోని ఏబై గ్రామాలకు మార్క్సిస్టులీడర్. సాగర్ కాలువ క్రింద నలబై ఎకరాల మాగాణి ఉన్నవాడు; మరో ఇరవై ఎకరాల 'మెట్ట' ఉన్నవాడు. పైకి సీదా సాదా ఖద్దరు బట్టలు వేసుకొంటాడు. కోటికి పడగెత్తిన కమ్యూనిస్టు భూస్వామి అని నల్లగొండ జిల్లాలోని అందరు చెప్పుకొంటుంటారు. భూస్వాముల్లో 90% మంది కమ్యూనిస్టుల్లో చేరడానికి కారణమేమిటని ప్రశ్నిస్తే ఇంకేం తమ భూములు కాపాడుకోడానికి, కూలీనాలీజనం మీద పూర్వంలాగే యథావిధిగా పెత్తనం చలాయించడానికి అనే సమాధానం వస్తుంది. నల్లగొండ జిల్లాలో కమ్యూనిస్టు రెడ్లు, కృష్ణా గుంటూరులో కమ్యూనిస్టు కమ్మలు బాగా బతుకుతెరువు నేర్చిన వారనే నానుడిఉంది.

'ఏమిటే అమ్మాయిని ఆ మిషన్ హాస్పిటల్ కన్న తీసుకపోలేదు. కేక వేశాడు వనజ తలమీదచేయివేసి మార్క్సిస్టు రెడ్డి.

'ఆ ఆస్పిటలోల్లే, ఆ చర్చీ సన్నాసులే అమ్మాయిని బాగా తన్నిరి; ఇంగ ఆస్పిటల్‌కేడా కొంచవోదు' అన్నది చేతులు తిప్పుకొంటూ వచ్చి రెడ్డమ్మ.

'చర్చి సన్నాసులేమిటి! తన్నడమేమిటి' విస్తుపోయాడు రెడ్డి, ఆరాతీస్తే తేలిన సంగతులివి.

వనజ, వర్ధని స్కూల్లో ఏడోక్లాసు. ఆస్కూలు మిషన్ వాళ్లది కాదుగాని, వాళ్ల సహకారం ఇంతో అంతో అందుతున్న హిందువులదే. అయితే యాజమాన్యం తాము నాస్తికుల మంటుంది. విశాలమైన ఆవరణ మూడంతస్తుల బిల్డింగ్. రెసిడెన్సియల్ వ్యవస్థ ఉంది. ఫీజులు బాగానే ఉంటాయి. అందులో ఎక్కువ శాతం మంది పిల్లలు కమ్యూనిస్టుల కుటుంబాల వాళ్లే.

స్కూలు పిల్లల్లో ఎక్కువ మందికి జ్వరాలు వస్తున్నాయి. హాస్టల్లో ఉన్నవారికి మరీను.



మిషన్ ఆస్పత్రివాళ్లు, చర్చివాళ్లు వైద్యం చేస్తామని వచ్చారు. పరీక్షలు చేసి పిల్లలందరికీ 'సైతాన్' పట్టుకొన్నదని నిర్ధారించారు. ఆ సైతాన్ను వెళ్లగొడతామని విద్యార్థినీ విద్యార్థులందరినీ ఆరుగంటలు ఎండలో నిలబెట్టారు.

ఓగంటసేపు తెలుగులో ఇంగ్లీషులో బైబిల్ చదివి వినిపించారు. ఆ తర్వాత ఓ అరగంట ఓ కిరస్తానీ ఫాదర్ ఉపన్యాసం దంచాడు.

"మీరంతా పాపములు చేస్తిరి; హిందువులుగ పుడ్తిరి. ఇప్పటికీ మీరు పాపములు చేయుచున్నారు. చెట్టు క్రింద ఉన్న ఎల్లమ్మకు మొక్కుచున్నారు. చెలకలోని గంగమ్మకు దండము పెట్టుచున్నారు. బొట్టు పెట్టుకొనుచున్నారు; అమ్మాయిలు పూలుకాటుక పెట్టుకొనుచున్నారు. గాజులు వేసుకొనుచున్నారు. కొందరు ఓంకారం బిళ్లలను, ఆంజనేయుని బొమ్మలను మెడలో వ్రేలాడదీసుకొనుచున్నారు. ఇన్ని పాప కార్యములు మీరు చేయుచున్న కారణముగనే మిమ్ములను సైతాన్ పట్టుకొన్నది.

మీ జబ్బులకు కట్టుకొన్న తాయెత్తులను, మీ మెడలోని మీ దేవుని బిళ్లలను తీసివేయుడు. ఆడపిల్లలు బొట్టు చెరిపి వేయుడు; గాజులు పగల గొట్టుడు. మావారు మీకు ఇచ్చు సిలువ తాడులను మీ మెడలో దిగవేయుడు...."

అలా అలాసాగిపోయింది అతని ఉపన్యాసం. ఆ తర్వాత ఆ ఫాదర్ అన్నట్లే పిల్లలందరు చేశారు. చేయని వారిని బలవంతాన చేయించారు. పిల్లలను పట్టుకొన్న సైతాన్ను పారద్రోలే కార్యక్రమం ప్రారంభమయింది.

తెల్లబట్టల నన్సు, ఓపదిమంది తెల్లబట్టల పురుషులు పిల్లల చేతుల మీద, కాళ్లమీద వీపుల మీద బాదడం మొదలుపెట్టారు. ఆరు నుండి పదవతరగతి వరకు చదువుతున్న 400 మంది బాలబాలికలు దాదాపు అందరికీ వాతలు వచ్చినై. ఏడ్చినా మొత్తుకొన్నా వదలలేదు. పిల్లలందరికీ ఆరుగంటలు ఎండలో నిలువుటుద్యోగం. అందులో మూడు గంటలు బడితె పూజవైద్యమే. "సైతాన్ గోబ్యాక్... సైతాన్ గోబ్యాక్" అని అరవడం బాదడం. నాలుగు వందల మందిలో కనీసం వంద మంది అయినా సొమ్మసిల్లి ఉంటారు. అందరికీ ప్రభువు తీర్థమని మినరల్ వాటర్ త్రాగించారు.

ఇప్పటినుండి బొట్టు, కాటుక, పూలు, మెడలో బిళ్లలు... అనే పాపపు పనులు చేయరాదని ఆదేశించారు. ప్రభువు దయవల్ల అందరినీ పట్టుకొన్న సైతాన్ పారి పోయిందని చివరి ప్రార్థన చేసి, కొందరి చేతులు ముద్దాడి నొసళ్లు ముద్దాడి వెళ్లిపోయారు.

'ముండా కొడుకులకు దయ్యం పట్టింది ఏమి' ఇదంతావిని అరిచాడు వనజ తండ్రి.

'వాళ్ల దయ్యం వదలగొట్టాలె' సాయిరెడ్డి రైతు అన్నాడు.

'సాయన్నా! ఆ మల్లన్నను, లచ్చుమన్నను రమ్మనుపో.. నేనిప్పుడే వెళ్లి ఆ దొంగముండల, ఆలం.. కొడుకుల దయ్యం వదల గొట్టించి వస్త....' అని లేచాడు రెడ్డి.

"కొద్ది ఆలోచించు. మాలోల్లల్ల సగం మంది కిరస్తానీలయింద్రు; నువ్విప్పుడు గడబిడసేస్తే 99 సెప్టెంబర్ల ఓట్లు పడవ్. అసలే ఈ సారి తెలుగుదేశ పోల్ల సాయం లేదు. మనోల్లు నల్లగొండ జిల్లాల పూర్వం సీట్లన్న రక్షించుకుంటరో లేదో నమ్మకం లేదు... ఆగమాగం సేసి పరేషాన్ కావద్దు; నాలుగొందల మంది పిల్లలను పట్టుకొన్న సైతాన్ వోయిందనుకో! నిన్నిప్పుడు ఓట్ల సైతాన్ వట్టుకొన్నదనుకో! జర్రసోచాయించి పనిజెయ్...." మెత్త మెత్తగా బ్రహ్మాండమైన కమ్యూనిస్టు స్ట్రాటజీ రెడ్డి ముందు వెట్టాడు రెడ్డి తండ్రి అంటే వనజ తాత.

'మిమ్ముల దయ్యాలెత్తుకపోను... మొట్టమొదలు పిల్లను ఆ ప్రసాదన్న దవాఖాన కన్న తీసుకుపోండ్రి' రెడ్డి భార్య భర్త మీద మావ మీద కేకలు వేసింది.

రెడ్డి ముడ్డి కిందేసుకున్న తువ్వాల దులిపి భుజం మీద వేసుకొని 'ఏహే ఆ ప్రసాదన్ననే పిలుసుకొస్త ఉండు; ఆ జరం దయ్యం అదే దెంకపోతది'... అంటూ వెళ్లిపోయాడు.

●





# 21. పుష్కరాల్లోనూ దుష్కర్మలా!

తీర్థక్షేత్రాల్లో పండ్రెండు సంవత్సరాలకొకసారి నిర్వహించే ఉత్సవ కార్యక్రమాల్ని పుష్కరాలు అంటారు. పుష్కరమంటే పండ్రెండు అనీ, పండుగలనీ, జలమనీ ఇంకా అనేక అర్థాలున్నాయి. ఇందులో జలంతో పండ్రెండుతో ముడివడి గోదావరి పుష్కరాలు, కృష్ణాపుష్కరాలు అనే పదాలు రూఢిపడ్డాయి. ప్రతి నదికి పండ్రెండేళ్లకోసారి పుష్కరోత్సవాలు నిర్వహించడం హిందూసామూహిక సంప్రదాయాల్లో ఒక పద్ధతిగా ఏర్పడింది.

గత సం॥ తుంగభద్ర పుష్కరోత్సవాలు కర్నూలులో జరిగాయి. అంతకు పూర్వం అప్పుడెప్పుడో కృష్ణాపుష్కరాలు జరిగాయి.

కృష్ణాపుష్కరాలకు లక్షలాది మంది భక్తులు వచ్చారు. నదీ పరీవాహక ప్రాంతమంతా కిటకిటలాడుతున్నది. విజయవాడ పరిసరాల్లో ఎటు చూచినా జనసందోహమే.

అనేక ప్రదేశాల్లో మంటపాలు నిర్మించారు. ఆ మంటపాల్లో ఒకచోట హరికథలు చెబుతున్నారు. మరోచోట బుఱ్ఱకథలు నడుస్తున్నాయి. ఇంకొకచోట వ్రతాలు నిర్వహిస్తున్నారు. వేరొకచోట పురాణ ప్రవచనం కొనసాగుతున్నది.

ఎక్కడ ఉండేవారు అక్కడే ఉన్నారు. తిరిగేవారు తిరుగు తున్నారు. ముండిత శిరస్కులు కృష్ణలో మునుగుతున్నారు. కేశాల వారూ మునుగుతున్నారు తేలుతున్నారు. పిల్లలు, స్త్రీలు, వృద్ధులు.. వయోభేదాలు లేవు. అందరికీ అన్ని విధాల ఆనందాన్ని కలిగించే కార్యక్రమాలు జరుగుతున్నాయి. భక్తి కాసెట్ల పాటలు వింటున్నారు. సంస్కారహీనులు అక్కడక్కడ బూతుపాటలు వినిపిస్తున్నారు. తమ తమ పళ్లాలలో దేవుని బొమ్మలు పెట్టుకొని కొందరు అటూ ఇటూ తిరుగుతూ దేవుని పేరిట పైసా పరకా అడుక్కొంటున్నారు.

ఎటు చూచినా జనం; ఘనాతి ఘనం. పాటలు, మంత్రాలు, శ్లోకాలు, నినాదాలు

- అదొక జాతర. అది హిందువుల పవిత్ర పర్వదినోత్సవంలో జనమల్లో జాతరమల్లోగా సాగిపోతున్న ఉత్సాహహేళ.

సందట్లో సడేమియాల్లాగా కిరస్తానీలు ఉత్సవాల్లో ప్రవేశించారు. కొన్ని మైళ్ల పొడుగునా పుష్కరోత్సవాలు జరుగుతున్నాయి. ప్రధానంగా జరిగే ఉత్సవాలు మాత్రం సువిశాలమైన పెండాల్లో - కొన్ని చోట్ల చాందినీల్లో జరుగుతున్నాయి.

చేతుల్లో మైకులతో, సంచుల్లో కరపత్రాలతో కిరస్తానీలు ప్రవేశించారు. వీళ్లంతా అదివరకే కిరస్తానీల ప్రలోభాలకులోనై మారిన హిందువులు. ఇలా హిందువుల జాతరలలో ఉత్సవాలలో ప్రచారంచెయ్యమని డబ్బులివ్వగా పుచ్చుకొని వచ్చిన కిరాయి మనుష్యులు కొందరు.

"నీళ్లల్లో మునిగితే రోగాలొచ్చును. మా ప్రార్థన చేయుడు. ఏసును నమ్ముకొనుడు. ఇదీ వారి మైకుల్లోని ప్రచారం..." ఇంకా అవీ ఇవీ.

ఇక విగ్రహారాధనమీద, తీర్థక్షేత్రాల మీద దుమ్మెత్తి పోసి హిందుత్వాన్ని దూషించే కరపత్రాల పంపిణీ.

పాపం! విశాల హృదయులు, ప్రజాస్వామ్యం మీద పూర్ణ విశ్వాసం ఉన్న అమాయిక హిందువులెందరో అవీ వింటూ వారికి దండం పెట్టి వెళ్లిపోతున్నారు.

మావిశ్వాసాలను విమర్శిస్తే మీ విశ్వాసాలనూ విమర్శించే వారుంటారని గుర్తుంచుకోండి అనుకొంటూ వెళ్లి పోయిన వారున్నారు.

'ఎవర్రా మీరు! తన్నులు తింటారు కొడుకుల్లారా!' అంటూ వెళ్లిపోయిన వారున్నారు.

పెద్ద పెండాల్లో ఒక స్వామిజీ ఉపన్యాసం జరుగుతుంది. ఆ సభలో కనీసం మూడువేల మంది ఉన్నారు. అక్కడికి వచ్చి కొందరు కరపత్రాలు పంచారు. ఈ విషయం కొందరు స్వామిజీ దృష్టికి తెచ్చారు.

కిరస్తానీలీవిధంగా ప్రచారం చేయడం తప్పని, చెప్పినా వినకుంటే కార్యకర్తలు బుద్ధి చెబుతారని అన్నారు.



'అయితే రేపు మేం వస్తాం, ఈ పుష్కరాలు నిర్వహించడమే తప్పని నిరూపిస్తాం' '.. అంటూ వెళ్లిపోయారు ఆ పదిమంది.

స్వామిజీ అక్కడ కూర్చున్న అందరితో అన్నారు... "రేపు వాళ్లు ఎంతోమంది రావచ్చు; గొడవ కావచ్చు, రేపు హిందువులు ఇంతకు రెండింతలు రావాలి. వారు వాదంచేయక కొట్లాటలకు దిగినట్లయితే అందుకూ సంసిద్ధమై రావాలన్నారు....'

ఆ మరుసాటి రోజు కూడా ఆ స్వామి వారిదే ఉపన్యాసం. పెండాల్లో పట్టుమని పదిమంది కూడా లేరు. అప్పుడు దాదాపు 500మంది కిరస్తానీ యువకులు-ప్రౌఢులు వచ్చారు. వారు నేరుగా స్వామిజీ ఉన్న వేదిక దగ్గరికి వెళ్లి ఆయన చేతిలోని మైకు లాక్కొని క్రీస్తు బోధలు వినిపించడం మొదలెట్టారు.

హిందువులు ఉన్న పదిమందిలో అయిదార్గురు స్వామిజీశిష్యులు వారు స్వామిజీని తీసుకొని వెళ్లిపోయారు. స్వామిజీని వారి శిష్యులను బూతులు తిట్టారు కిరస్తానీలు.

స్వామిజీ తలవంచుకొని పెండాల్ దాటి వెళ్లిపోయారు. ఈలోగా పోలీసులు వచ్చారు. కిరస్తానీలు వేదిక వదిలిపెట్టి, ఏమీ తెలియనట్టు వెళ్లిపోయారు.

అలా వెడుతున్న స్వామిజీని ఓకార్యకర్త అడిగాడు." ఏంజరిగిందని"....

'హిందువులందరూ పిరికివాళ్లే... హిందుత్వం నుండి మారిన కిరస్తానీలు అయిదువందల మంది మీదికి వస్తే, ఒక్కడంటెఒక్కడు వారిని ఆపలేదు... ఛీ....'

ఈ సడించుకొన్నాడు స్వామిజీ.

'వారిని వేదిక దగ్గరికి ఎందుకురానిచ్చారు స్వామి!' అడిగాడు పుష్కరాల్లో సేవాకార్యక్రమాలు చూచే కార్యకర్త.

'ఆ ప్రశ్న నేను నిన్ను అడగాలి... నువ్వు నన్ను కాదు'.... అంటూ వెళ్లిపోయాడు స్వామిజీ.

ఆ తర్వాత ఆ కార్యకర్తకు అన్ని విషయాలు అర్థమయ్యాయి. వైద్యసేవల్లో, భోజనవసతిలో, శుభ్రతతో వస్తురక్షణలో, తీర్థ స్నానాల సమీపంలో, ప్రజల్ని

సరియైన దిశను తరలించడంలో... ఇలా భిన్న భిన్న వ్యవస్థల్లో నిమగ్నమై ఉన్న కార్యకర్తలందరికీ ఈ విషయం చేరవేశాడు అతను.

ఆరోజు రాత్రి బ్రహ్మాండమైన "ఘటవర్క్" జరిగింది. ఆ మరుసటి రోజు నుండి ఒక్క కిరస్తానీ మతోన్మాది పుష్కరాల్లో కనిపిస్తే ఒట్టు.

లక్షలాది మంది ఉండే హిందువుల పుష్కరాల్లో కూడా దుష్కర్మాలకు ఒడిగట్టే ఈదుస్సాహసం నేపథ్యం ఏమిటి? ఇటువంటి మతోన్మాద దుండగీళ్లకు ఎలా బుద్ధి చెప్పాలో హిందువులే నిర్ణయించుకోవాలి మరి!





# 22. కొడితే ఏనుగునేకొడదాం!

'మీ అమ్మాయికి క్లర్క్ ఉద్యోగం వచ్చింది కదండీ' అడిగాడు ఫాదరి.

'అవును వచ్చింది' అన్నారు అయ్యవారాఉ.

'మేము ప్రభువును ప్రార్థించితిమి; అందువలన వచ్చినది'...

దారిలో కలిసి అలా అన్న ఆ ఫాదరీ దిక్కు ఎగాదిగా చూచి పొలంలోకి వెళ్లిపోయారు అయ్యావారు.

అయ్య వారిది ఖమ్మం దగ్గర తల్లాడ గ్రామం. వాళ్లెంత వైష్ణవులైనా తాతముత్తాతలనుండి వస్తున్న వ్యవసాయక్షేత్రాన్ని వదలిపెట్టలేదు. మాగాణి, మెట్ట రెండు పంటల్లోనూ కుటుంబానికి సరిపోను పండించుకొంటూనే ఉన్న కుటుంబం అది.

అయ్య వారి పూర్వీకులు ఓ దేవాలయంలో కూడా చేశారు. అది ఎండో మెంట్సు చేతుల్లోకి వెళ్లిపోయింతర్వాత వీరు మానుకొన్నారు. ఆ ఆలయంలో ఇప్పుడు పూజారులు కూడా ఉద్యోగులే.

అయ్యావారికి ముగ్గురమ్మాయిలు, ఇద్దరు కొడుకులు. పెద్దమ్మాయికి పెళ్లయి భర్తతో వెళ్లిపోయింది. రెండో అమ్మాయికి ఖమ్మంలోని హైస్కూల్లో తెలుగుపండిత్ ఉద్యోగం వచ్చింది. మూడో అమ్మాయికి ఇప్పుడు క్లర్కు పోస్టు వచ్చింది. ఇక కొడుకులిద్దరు ఆరేడు తరగతుల్లో ఉన్నారు.

పెద్దమ్మాయి బాగా కారునలుపు. కాని నాలుగు ముక్కలు వ్రాస్తే, నాలుగు వాక్యాలంటే పాండిత్య పరిపక్వత, పరిపూర్ణలోకజ్ఞత కనిపిస్తుంది. ఆ అమ్మాయి కిరస్తానీల పాఠశాలలో చదివేప్పుడు పేరు మార్చి మతం మార్చడానికి కిరస్తానీ పంతులమ్మలు విఫలప్రయత్నాలు చేశారు. ఆ అమ్మాయి అయ్యావారి నుండి అనుకూల్యం లభించక పోయేసరికి తోకముడిచారు. కాని అప్పుడప్పుడు ఒకరిద్దరు నన్స్, ఒకరిద్దరు ఫాదరీలు అయ్యావారిని కలిసి ఏదో ఒకటి అంటుండేవారు. ఆ

విధంగానే ఈరోజు "మేము ప్రార్థించితిమి; అందువలన ఉద్యోగము వచ్చినది" అన్నారు. అంతకు పూర్వం కూడా వారన్న మాటలు పొలంలో తిరుగుతున్న అయ్యవారిమనస్సులో తిరుగుతున్నాయి.

"మీ పెద్దమ్మాయి పెళ్లి కుదురవలెనని, ఉద్యోగస్తుడైన వరుడు దొరకవలెనని మేము ప్రార్థనలు చేసితిమి...' ఓఫాదరి పెద్దమ్మాయి పెళ్లి సందర్భంలో అన్నాడు.

"మీ అమ్మాయి పురుడుకు మేమిచ్చు కానుక" అంటూ అమ్మాయికి కొడుకు పుట్టిన సందర్భంగా వెండి ఏసు బొమ్మను బహుమానంగా ఇచ్చి వెళ్లారు.

"మీ చిన్నమ్మాయి టెంత్‌లో ఫస్ట్‌క్లాసులో పాసు కావడానికి మా డేనియల్ చెప్పిన ఇంగ్లీషే కారణం; ఆ ప్రభువు కరుణామయుడు ఆమె పరీక్ష వ్రాసేప్పుడు తోడుగా ఉండి వ్రాయించాడు"... చిన్నమ్మాయి ఎస్ఎస్‌సి పాసైనప్పుడు ఫాదరీ అన్నమాటలు.

ఆ తర్వాత అమ్మాయి ఆటల్లో బహుమతులు సాధించుకొన్నప్పుడు, వ్యాసరచన వక్తృత్వాల్లో ప్రశంసలు పొందినప్పుడు, వచ్చి అభినందించారు. అనేక బహుమతులు తెచ్చిఇచ్చారు.

ఇప్పుడుద్యోగం దొరికింది. అయిదారు రోజులుగా అమ్మాయి ఖమ్మం నగరంలో ఉన్న ఆఫీసుకు వెళ్లివస్తుంది. వచ్చేప్పుడు వెళ్లేప్పుడు ఓ కిరస్తాని ఉద్యోగిని మాటి మాటికి క్రైస్తవభక్తి గీతాలు వినిపిస్తుందని అమ్మాయి చెప్పింది. 'వీళ్లకేం పోయేగాలమొచ్చిందో తమ కుటుంబం వెంబడి ఇలా పడ్డారు' అయ్యవారు ఆలోచిస్తూ పొలమంతా తిరిగి సాయంకాలనికి ఇంటికి చేరుకొన్నారు.

స్నానంచేసి పూజాపునస్కారాలు ముగించి వరండాలో ఉదయం వచ్చిన పత్రిక తిరగవేస్తున్నారు అయ్యవారు. చిన్నమ్మాయి వచ్చి తండ్రికి దగ్గరగా కూచున్నది. తల్లి రాత్రి వంటకు కూరగాయాలు తరుగుతున్నది.

ఆరోజు మధ్యాహ్న సమయంలో గోడపక్క నుండి ఎవరో తన పేరును మాటల మధ్యలో తేవడంతో చాటుగా ఉండి విన్న మాటలు కూతురు చెప్పింది.

'అవును మనం హరిజనులమైతే తొందరగా మతం మార్చొచ్చుగానీ



ఈదాసరయ్యను మార్చడం కష్టం; నీవు ఆ జ్యోతి వెంబడి ఎందుకు పడ్డావ్'... ఒకామె అడుగుతున్నది తనతో పాటే పనిచేస్తున్న కిరస్తానీ ఉద్యోగినిని.

'వాళ్లను ఏబయి మందిని మార్చినా కలగని లాభం ఈఅమ్మాయినీ వీళ్ల కుటుంబాన్ని మార్చడం వల్ల పొందగలుగుతాం. వీళ్లకు సంస్కృతం తెలుసు, సంప్రదాయం తెలుసు; భక్తి గురించి బాగా తెలుసు. వీళ్లు మారితే రేపటి నాడు అదే క్రీస్తు చెప్పినాడని వీరు ప్రచారం చేస్తారు. వీళ్లకు వాక్శుద్ధి ఉంది. సమాజంలో గౌరవం ఉంది. వీళ్ల మార్గమే మంచిదని మిగతా వాళ్లు కూడా అనుసరిస్తారు. అందుకే ఇంత ప్రయత్నం...' తన సాటి ఉద్యోగిని అన్నది.

తల్లి ముక్కు మీద వ్రేలేసుకొన్నది. 'పిచ్చివెధవలు' అంటూ తండ్రి పక పక నవ్వాడు. అప్పుడే ప్రహరీ గేటు తీసి, లోనికి వచ్చాడు ఫాదర్ శామ్యూల్. 'మీ అమ్మాయి పెళ్లి'... అని అతడు నోరు విప్పాడో లెదో,' ఆ పళ్లెంలో దేవుని ప్రసాదముంది; ముందు అది తీసుకొని తినండి... అది తింటేనే మీమాటవింటా' అన్నారు అయ్యవారు.

'మళ్లీ వస్తానంటూ' పారిపోయాడు ఫాదర్ శామ్యూల్.

ఈ దేశంలో ఇప్పుడు హిందువు కూడా తన మతధర్మాల గురించి ప్రచారం చేయవలసి ఉంది. పునరాగమన కార్యక్రమంచేపట్టవలసి ఉంది'... అంటూ నడుముకు తువ్వాలు చుట్టి లేచి నిలుచున్నాడు అయ్యవారు.



## 23. గుడిగంటలు ఆపాలంటా !?

"గుడిగంటలు కొట్టకూడదని మీరనడం సమంజసం కాదు" - అన్నాడు స్వామీజి.

"మేం శాసించడం లేదు; అభ్యర్థిస్తున్నాం" అన్నాడు పోలీస్ సర్కిలినిస్పెక్టర్.

"ప్రతి రోజూ సాయంకాలం నాలుగ్గంటల నుండి మరుసటి రోజు ఉదయం 9 గం. వరకు గంటలు మ్రోగించ వద్దనడం విడ్డూరం కదండీ!" విస్తుపోయాడు స్వామీజి.

"ఇది మధ్యాహ్నం మాత్రమే గంటలు కొట్టే దేవాలయమనీ, ఆ తర్వాత మౌన దేవాలయమని మీరు ప్రకటిస్తే భక్తులందరూ వింటారు స్వామి!" ప్రాధేయపడ్డాడు సర్కిలినిస్పెక్టర్.

"ఇంత విడ్డూరం ఎక్కడన్నా వింటిమా! కంటిమా! ఈ సెంటర్లో అష్టాభుజాదేవి ఆలయం కట్టి పదేళ్లవుతున్నది. ఈ పదేళ్లుగా మ్రోగుతున్న గుడిగంటలు ఓ ప్రత్యేకసమయంలో ఆపవలసిందని కోరడం వెనుక ఏ సైతాన్ ఉన్నదో నాకర్థం కావడం లేదు"... ఆశ్చర్యంగా చూశాడు స్వామీజి.

"ఏ సైతాన్ ఉన్నదో అది మీకు తెలిసిపోయింది... మీరు త్రికాలజ్ఞులు; ఇట్టే పసిగట్టేశారు..." స్వామీజీని ప్రశంసించాడు ఇనిస్పెక్టర్.

"హరి దొంగభడవా!... ఇటునుంచి నరుక్కొచ్చాడా! వాడు!! ఇక అర్థమైపోయిందిలే. ఆ కిరస్తానీ మెజిస్ట్రేటుగాడి పన్నాగమేనా ఇది... వాడు మిమ్మల్ని ఉపయోగించుకొంటున్నాడా! వాడు వచ్చి నెల కాలేదు... ఎన్ని ఎత్తులు ఎత్తుతున్నాడు... ఎన్ని జిత్తులు పన్నుతున్నాడు... మీరేమో వాడు ఆడించినట్లల్లా ఆడుతున్నారు... మీకు వ్యక్తిత్వం లేదు.... వెన్నుపూస లేదు... మీకు ధర్మం లేదు.... స్వాభిమానం లేదు... మీకు మీదంటూ ఒక మతం లేదు... వాడికి మాత్రం మతముంటుంది. అన్నీ ఉంటాయి. మీరు నొసటన బొట్టు పెట్టుకోడానికి కూడా భయపడతారు. చేతిలో గీత పట్టుకోడానికి జంకుతారు. భజనలు చేయరు. అవతలి



మతంవాడి మాటకు తందాన తాన అని తాళం గొట్టి గొప్ప సెక్యులరిస్టులుగా ఫోజులు గొడతారు..." స్వామి వారు దాదాపుగా అరచినంత పనిచేశారు.

అంతసేపూ ఇనిస్పెక్టర్ తలవంచుకొని కూచున్నాడు. స్వామివారి కళ్లల్లోకి చూచే శక్తి కూడాలేక పక్కన్నే ఉన్న కానిస్టేబుల్‌కు సైగ చేసి ఆలయం నుండి వెలుపలికి వచ్చి నిలుచున్నాడు. కానిస్టేబుల్ స్వామీజీ కాళ్లపై పడ్డాడు.

"స్వామి వారూ! మీరేమనుకోకండి! మా ఇనిస్పెక్టర్ పైన డిఎస్పీ ఒత్తుతున్నాడు. ఆ డిఎస్పీ కిరస్తానీ. అతణ్ణి మెజిస్ట్రేట్ మొత్తుతున్నాడు. ఈ విషచక్రంలో మేం గిలగిల గొట్టుకొంటున్నాం..." దాదాపు ఏడ్పుమొగం పెట్టాడు కానిస్టేబుల్.

'ఈ సెంటర్ చుట్టున్న హిందువులందరూ ఏకమైతే మీ మెజిస్ట్రేట్ గాడి క్వార్టరే ఇక్కణ్ణుండి ఎగిరిపోతుంది తెలుసా! వాడు వాని ఫ్యూన్ను పంపి గంటలు ఆపుమని చెప్పంపినప్పుడే నేను అయిదార్గురు యువకుల చెవిలో ఇది ఊదాను. ఇప్పుడు ఊరంతా ఇది తెలిసిపోతుంది. మనం గంటలు ఆపితే మంటలు రేగుతై...' స్థిరంగా అన్నాడు స్వామీజి.

కానిస్టేబుల్ దండం పెడుతూ వెనక్కు వెళ్లిపోయాడు. 'స్వామీజీ జై అష్టదుర్గామాతా' అంటూ లేచి నిలుచున్నాడు.

అది తెనాలి; గుంటూరు కల్లంత దూరం. ఆ పట్టణంలోని సెంటర్లో అష్టభుజాదేవి వెలసింది. మలయాళ సద్గురు సంప్రదాయం అనుసరించే స్వాములవారు ఆ ఆలయాన్ని ఆధారంగా చేసుకొని వేదాంత విజ్ఞానాన్ని బోధిస్తున్నారు. చుట్టూ వ్యాపారులుంటారు. అమ్మ వారి విగ్రహ ప్రతిష్ఠాపన జరిగిన తర్వాత జనం ఎక్కువగా వస్తున్నారు. గుడిగంటలు ఎక్కువగానే మ్రోగుతున్నాయి. దర్శనార్థం వచ్చిన వారందరూ మ్రోగిస్తారు. ఉదయసాయంకాల పూజా వేళలో అర్చక స్వాములు మ్రోగిస్తారు.

అక్కడికి ఎక్కువగా హిందూ మెజిస్ట్రేటులే వచ్చారు. ఓ నెల రోజుల క్రితం కిరస్తానీ మెజిస్ట్రేటు ఒకాయన వచ్చారు. ఆయన వచ్చిన తర్వాత రెండు పర్యాయాలు కిరస్తానీ కుర్రాళ్లు హిందూత్వాన్ని దూషించే కరపత్రాలు గుడి ముందట

3 పంచారు; గుళ్లోకి విసరివేశారు. స్వామీజీ ఆ కుర్రాళ్లను హెచ్చరించారు. ఆ తర్వాత రెండుసార్లు మెజిస్ట్రేట్ తన ప్యూన్‌తో చెప్పంపాడు - 'గుడిగంటల వల్ల తన చదువుకూ తన ప్రార్థనకు ఆటంక మేర్పడుతున్నదని, అందుకని గుడిగంటలు మ్రోగించరాదని".

"మా మెజిస్ట్రేటు గారికి గుడిగంటలు చెవుల్లో పడడం ఇష్టం లేదా! ఏం సీసం పోసినట్లుంటుందా! అయితే ప్రభుత్వ క్వార్టర్ వదలి పెట్టి మరోచోట ఉండమను. గుడి మారదు - గుడిగంటలు ఆగవు..." కచ్చితంగా అన్నాడు స్వామిజి.

ఇప్పుడేమో పోలీసు పెత్తనం నడిపించే ప్రయత్నం చేశాడు. స్వామీజీ వెనువెంటనే మున్సిపల్ చైర్మెన్ను, ఎం.ఎల్.ఎను, ఎం.పీని కలిశాడు. జరిగిన సంగతంతా చెప్పారు. అందరూ తామూ చూస్తాం అన్నారు; ఏదేదో చేస్తాం అన్నారు; ఇప్పుడే చేసేస్తాం అన్నారు. కానీ వారం రోజుల వరకూ ఏమీ జరగలేదు.

వారంతర్వాత కిరస్తానీ డిఎస్పీ బూటుకాళ్లతో దేవాలయంలో ప్రవేశించారు. గుడిగంటలు ఆపకపోతే అరెస్టు చేస్తా అని స్వామిజీని తిట్టి వెళ్లిపోయాడు. అతనున్న 15 ని.లు నానా హంగామా చేశాడు.

అప్పటి నుండి స్వామిజీ తన ఉపన్యాసం జరిగిన చోటుల్లో క్రైస్తవం సృష్టించినంత రక్తపాతం ప్రపంచంలో మరోమతం సృష్టించలేదంటున్నారు. క్రైస్తవ మతోన్మాదం జాతీయోద్యమంలో 40 లక్షల మందిని చంపిందని ఉదాహరణలిస్తున్నారు. భగత్సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్, చంద్రశేఖర్ ఆజాద్, ఝాన్సీలక్ష్మీబాయి, తాంత్యాటోపే, అల్లూరి సీతారామరాజు తదితరులను చంపింది క్రైస్తవ మతోన్మాదమే అని ఎలుగెత్తి చాటుతున్నారు. గురివిందగింజ తన క్రింద ఇంత నలుపు పెట్టుకొని హిందుత్వాన్ని వెక్కిరిస్తుంటే నేనూ తప్పనిసరిగా ఆ నలుపును ఎత్తి చూపాల్సి వస్తుందని అన్నారు.

హిందువుల్లో పొగలు సెగలు రగులుకొంటున్నాయి. అవి మంటలై వెలుపలికి రాకముందే డిఎస్పీ, మెజిస్ట్రేటు లిద్దరూ బదిలీ అయ్యారు. గుడిగంటలు ఆపాలి అన్న కిరస్తానం చర్చిగంటలూ అరిచే ప్రార్థనలు అపుతుందా!



# 24. విషకన్యా ప్రయోగం

మూర్తీభవించిన శోకదేవతలా ఉన్నదా యువతి. ఆమె ముందు శవం. అది అందంగా తెల్లగా ఉన్న నలబై అయిదేళ్ల వ్యక్తిది. నిన్ననే వారిరువురూ తిరుమలలో పెళ్లి చేసికొన్నారు. ఆ యువతి ఏడ్పు వల్ల ఈ సంగతి పోలీసులకు తెలిసింది. అందుకు సాక్షిగా మెడలో బంగారు గొలుసుతోపాటు నిగనిగ మెరుస్తున్న మంగళసూత్రాలు.

తెల్లవారుజామున నాలుగు గంటలకు గుండెనొప్పి వచ్చిందిట. ఎక్కడా ఏ వెహికిల్ దొరకలేదట. ఏదో విధంగా తానో కారు మాటాడుకొని వచ్చే వరకు ప్రాణం పోయిందట...

'శవాన్ని మీ ఊరికి తీసుకొని పొండి! కారు మాటాడుతాం'

'అంత దూరం తీసుకొని పోలేను... ఇక్కడే దహన సంస్కారాల ఏర్పాటు చూడండి!' అన్నది ఆ యువతి.

ఎస్.ఐ. అన్ని వివరాలు నోట్ చేసుకొన్నాడు. అతనిది నల్లగొండ జిల్లా. ఆ జిల్లాలోని ఓ మండల కేంద్రంలోని ప్రైవేటు పాఠశాల ప్రధానోపాధ్యాయుడు. ఈ యువతి అందులో టీచర్. తిరుమలకు వచ్చి పెళ్లి చేసుకొన్నారు. అతను బ్రాహ్మణుడు. ఈమె మలయాళీ క్రిష్టియన్. మలయాళం, ఇంగ్లీషు, తెలుగు మూడు భాషలూ బాగా వచ్చు. ఆరు నెలల క్రితం ఆ స్కూల్లో చేరింది. అతనికి పెళ్లయ్యింది. ఆ మొదటి భార్యకతను రెండేళ్ల క్రితమే విడాకులిచ్చాడు. అతను ఒంటరి; తాను ఒంటరి; అందువల్ల పెళ్లి చేసుకొందామనుకొన్నారు. ఈ దహన సంస్కారాలైన వెంటనే తాను వెళ్లి స్కూలు మంచి చెడ్డలు చూచుకోవాలి. ఇప్పటికే స్కూలు వదలిపెట్టి మూడు రోజులయింది.

మంచి కారు మాటాడి పంపిస్తామని ఎస్.ఐ. బయలుదేరాడు. తన వెంట ఉన్న ఇద్దరు పోలీసులను అక్కడే ఉండుమన్నాడు. నల్లగొండ ఎస్.పి.

కార్యాలయానికి ఫోన్ చేసి, అక్కడి నుండి ఆ మండల కేంద్రం పోలీసు స్టేషన్‌కు సమాచార మందించి గంటలో సమాచారం రాబట్టాడు.

ఆ మండల కేంద్రంలో 750 మంది ఉన్న పాఠశాలకు ఈచనిపోయిన వ్యక్తి ప్రధానోపాధ్యాయుడు. బి.ఎస్సి, బి.ఎడ్ చేసి కొన్నాళ్లపాటు ప్రయివేటు పాఠశాలల్లో పనిచేసి తానే సొంతంగా పాఠశాల పెట్టుకొన్నాడు. అతనికి భార్య ఇద్దరు పిల్లలున్నారు. పిల్లలు 9,10 తరగతులు చదువుతున్నారు. ఆమె కూడా చిన్న తరగుతులకు పాఠాలు చెబుతుంది. మంచిపేరున్న ఇంగ్లీషుతెలుగు మీడియం పాఠశాల.

ఆ మండల కేంద్రంలో క్రిష్టియన్సు పాఠశాల తెరిచారు. అది అంతంత మాత్రంగానే నడుస్తుంది. ప్రైవేటు పాఠశాలల్లో ఈ చనిపోయిన వ్యక్తి పాఠశాలకే మంచి పేరుంది. ఈ మలయాళీ క్రిష్టియన్ యువతి ఇంగ్లీషు బోధించడానికి ఆరు నెలల క్రితం చేరింది. వీరిద్దరి వ్యవహారం ముదిరిపాకానపడడం అతనిభార్య గ్రహించింది. పిల్లలున్నారు; పదిమందిలో పలచన అవుతాం అన్నది ఆమె. 'నీవు అనుమానాల పిశాచానివి; మా మధ్యన అలాంటి సంబంధమేమీ లేదు' అన్నాడతను. పిల్లల ఫీజులు వేలకు వేలు మాయమవుతుండడం, ఆ కిరస్తానీ యువతి రకరకాల నగలు చీరలూ ధరిస్తుండడం, ఆమె అందంగా అలంకరించుకొని తన భర్తను రాసుకొంటూ పూసుకొంటూ తిరుగుతుండడం, మిగతా అధ్యాపకులు చెవులు కొరుక్కుంటుండం జరగుతూనే ఉన్నది. దీనికి పరిష్కారమేమిటా అని ఆ యువతి ఆలోచిస్తూనే ఉన్నది. ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది. ఆమె తన ఊరినుండి అన్నదమ్ములతో కలిసి కారులో తిరుపతికి బయలుదేరుతున్నదన్న సమాచారం కూడా ఎస్ఐకి అందింది.

గంట తర్వాత శవం ఉన్న కాటేజ్ దగ్గరికి ఎస్ఐ వచ్చారు. శవాన్ని హాస్పిటల్‌కు తీసుకొని వెళ్లవలసిందిగా పోలీసులనాదేశించాడు. ఆ యువతిని స్టేషన్ లాకప్‌లో పెట్టమన్నాడు. మరో నలుగురు పోలీసులు వచ్చారు. దిగువ తిరుపతి హాస్పిటల్‌కు శవం తరలింది.

ఆ యువతి లాకప్‌లో ఏడుపు లంకించుకొంది.



'సోర్మయ్! ఇప్పుడే అన్నీ తెలిసినాయి. కల్యాణమంటపంలో దేవుని సన్నిధిలో నిన్న మీకు పెళ్ళయినట్లుగా రికార్డు కాలేదు. శవం రంగుమారుతున్నది. విషప్రయోగం జరిగిందనే మా అనుమానం. మంగళ సూత్రధారణ జరిగితే, సూత్రంగా పసుపుతాడుంటుంది; కాని డైరెక్టుగా మీరేమీ బంగారు గొలుసుతోనే మాంగళ్యాలు కట్టుకొన్నారు; సంప్రదాయం తెలిసి ఉంటే అలా చేసేవారు కారు; పాపం పండింది; దొరికిపోయారు. ఇక పోస్ట్‌మార్టం నివేదిక వస్తే అసలు సంగతి తెలుస్తుంది. ఏం ఆశించి ఓ నిండు ప్రాణాన్ని బలితీసుకొన్నావేదయ్యపు ముండా!.....' బెత్తంతో నాలుగు అంటించాడు ఎస్ఐ.

ఆమె నోట ఒక్కమాటరాలేదు. ఏడుస్తుంది అంతే!

అప్పుడే ఫోనుమ్రోగింది. ఎస్ఐ లాకప్ తలుపుమూసివచ్చి ఫోన్ ఎత్తాడు.

'ఎస్ఐగారూ! జాగ్రత్తగా వినండి! శవాన్ని పోస్ట్‌మార్టం చేయకుండా దహనం జరిపించి, ఆ యువతిని మీరువదిలి పెడితే మూడులక్షలిస్తాం. పోస్ట్‌మార్టం జరపకుండా శవాన్ని అతని మొదటిభార్యకు ఇచ్చి ఈ యువతిని వదలిపెడితే రెండులక్షలిస్తాం. శవంతో మాకేం సంబంధం లేదు. కేసు మీలాకప్‌లోని యువతి మీదికి రాకుండా చేస్తే చాలు లక్ష రూ॥లిస్తాం. ఇందులో మీకేది ఇష్టమో గంటతర్వాత ఫోన్ చేస్తాం..' అంటూ అటువైపు వ్యక్తి ఫోన్ పెట్టేశాడు.

మరుసటిరోజు తెల్లవారే వరకు నల్లగొండ నుండి అతని భార్యా బావమరుదులు వచ్చారు. శవానికి పోస్ట్‌మార్టం జరగలేదు. శవం నల్లగా మాడిపోయి ఉంది.

"మీరు ఇష్టపడితే పోస్ట్‌మార్టం చేయిస్తాం. ఇతని వెంబడి ఉన్న యువతీ, మరో ఇద్దరు పారిపోయారు. ఆ కాటేజ్‌లో ఈ అయిదువేల రూ॥లు దొరికాయి; ఈ బంగారు రింగున్నది. మీరు ఇష్టపడితే ఇక్కడే దహనం చేయిస్తాం. లేకుంటే మీరు మీ గ్రామానికి తీసుకుపోవచ్చు' అన్నాడు ఎస్ఐ ఆ ప్రధానాచార్యుని భార్యతో బావమరదులతో.

ఆ యువతిని పట్టుకోనందుకు, ఆమె వెంబడి ఉన్నవారిని జైల్లో పెట్టనందుకు

బావమరదులు పోలీసులను తిట్టిపోశారు. 'మన బంగారం మంచిదైతే ఇదంతా ఎందుకు జరుగుతుంది'- అని కసరుకున్నాడు ఎస్.ఐ. 'వాళ్లనెలాగైనా పట్టుకొని శిక్షించండిసర్' అన్నారు బావమరదులు. 'మేమున్నదే అందుకు' అన్నాడు స్థిరంగా ఎస్ఐ.

'మా బావగారి స్కూల్‌కు బాగా పేరొచ్చిందిసర్! కొంతమంది కిరస్తానీలు ఈ విషకన్యను ప్రయోగించారు. పెళ్లి చేసుకొన్న తర్వాత అతణ్ణి చంపి, మొత్తం స్కూలునే కాజెయ్యాలని ప్లాన్ వేశారు. బహుశా మా బావకు తిరుపతికి వచ్చాక బుద్ధివచ్చినట్లుంది. పెళ్లి తర్వాత ఎప్పుడో చంపి స్కూలును సొంతం చేసుకోవాలనుకొన్నవారు; మా బావగారు ఎదురు తిరిగేవరకు ఇక్కడే చంపేసి పారిపోయారండి!' అన్నారు బావమరదులు.

'చాలా పెద్ద వ్యూహమే! ఎప్పుడో చాణక్యుని కాలంలో విషకన్యా ప్రయోగం జరిగిందని విన్నాం! ఇప్పుడూ జరుగుతున్నాయన్నమాట! అయితే మగవాళ్లు జాగ్రత్తగా ఉండాలి' అన్నాడు ఎస్ఐ. ఎస్ఐ కోరినచోటల్లా సంతకాలుపెట్టి శవంతో బంధుగణం బయలుదేరింది.





# 25. ఎల్లమ్మను పూజిస్తే దయ్యాలై పుడతారు!

'సార్! ఎల్లమ్మను పూజిస్తే దయ్యాలై పుడతారా!' అడిగాడు ఈశ్వర్.

'ఎవరన్నారు'! అడిగాడు తెలుగు పంతులు వెంకటరమణ.

'నేను మా ఎల్లమ్మ గుడికాడ బొట్టు పెట్టుకొంటుంటే, ఒకడంటున్నడు'.

'ఏడివాడు?'

'మన మరెమ్మటీచర్‌వాడు కలిసి ఊళ్లచందాలు అడుగుతున్నరుసర్'

'ఎందుకు చందాలు అడుగుతున్నారు'

'మేరెమ్మ గుడికడతరంట!'

'ఎల్లమ్మగుడికి పోతే దయ్యాలై పుడితే, మేరెమ్మ గుడికి పోతే ఏమై పుడతరంట! అడగాల్సింది!' అన్నాడు వెంకటరమణ.

అయినా నాల్గోతరగతి విద్యార్థి ఏమని అడుగుతాడు. ఆ పిల్లాడు ఎల్లమ్మ గుడిదగ్గర బొట్టుపెట్టుకొంటుంటేనే సహించని కిరస్తానీ ప్రచారకుల వింతధోరణి గూర్చి ఆలోచిస్తున్నాడు వెంకటరమణ.

ఈశ్వర్ ఇంటిపక్కనే ఎల్లమ్మగుడి ఉంటుంది. రోడ్డుపక్కనే చిన్నగుడి. పక్కనే వేపచెట్టు. చెప్పులు కుట్టిబతికిన ఈశ్వర్ నాన్న బతుకు తెరువుకు భాగ్యనగర్ వెళ్లిపోయాడు. తల్లి కూలికి వెడుతుంది. నాయనమ్మ ఇంటిదగ్గర ఉంటుంది. వెంకటరమణ పంతులంటే ఈశ్వర్‌కెంతో ఇష్టం. ఆయనపద్యాలు నేర్పుతాడు; పాటలుపాడిస్తాడు. అందుకే ఈశ్వర్ తనమనస్సులోకి ఏది వస్తే అదే స్వతంత్రంగా అడిగేస్తాడు. వెంకటరమణ కూడా ఈశ్వర్‌కు కావాల్సిన పుస్తకాలు, కాపీలు ఇప్పించడం ఏడాదిగా జరుగుతున్నది. రమణ 4 నుండి 7వ తరగతి వరకు తెలుగు చెబుతాడు. ఈ నాల్గు తరగతుల పిల్లలు ఆయనంటే పడిచస్తారు. రమణ ఈశ్వర్‌ను మరికొంతమందిని గుచ్చి గుచ్చి అడిగితే తెలిసిన విషయాలెన్నోఉన్నాయి.

అది ఘట్‌కేశ్వర్ దగ్గర చిన్న పల్లె. ఆ పల్లెలో అప్పటికే కిరస్తానీల పాఠశాల ఉంది. చర్చి కూడా ఉంది. ఇప్పుడు వారికి రోడ్డుకు దగ్గరగా ఉన్న వేప చెట్టుపక్కనున్న ఎల్లమ్మగుడి దగ్గర మేరెమ్మ" గుడిగట్టాలనిపించింది. అందుకే గత నెలరోజులుగా ఊళ్లోచందాలు వసూలు చేస్తున్నారు. ఎల్లమ్మ గుడి స్థలం అంతా కలిపి పది గజాల్లో ఉంది. మేరెమ్మ గుడి వందగజాల్లో వెలుస్తున్నది. ఊళ్లోని పటేలు పట్వారి సర్పంచ్ అందరు తలావంద రెండువందలు వ్రాశారు. తమ జెడ్.పి. స్కూల్లోని ఒకరిద్దరు క్రిష్టియన్ టీచర్లు చుట్టుప్రక్కల గ్రామాల్లో తిరిగి కావాల్సినన్ని చందాలు వసూలు చేశారు. మేరెమ్మగుడికి నూటికి తొంబయి తొమ్మిది మంది హిందువులే చందాలిచ్చారు. మతం మారిన హిందువుల ఇండ్లు ఊరికి రెండు మూడు కంటే ఎక్కువ లేవు. తొంబై ఏడు ఇండ్లు హిందువులవే. ఆ ఊళ్లో ఆంజనేయస్వామి గుడి ఉంది. పాతకాలంనాటి రాళ్లగుడి. దానికే ఏటా సున్నం గొడతారు. చుట్టూ కూలిన ప్రహరీగోడలున్నాయి. దయతలచిన తల్లి పెచ్చులూడిపోతున్న ఆ కూలిన గోడలకే పేడతో పూతపూస్తుంది. తనశక్తి మేరకు సేవ చేస్తుంది. మారుతిగుడి ముందే మర్రిచెట్టు. అది కాకులకు నిలయం. అప్పుడప్పుడు కోతులూకనిపిస్తాయి. ఆ చెట్టు క్రింద పిల్లలు గోళీకాయలాడుకొంటారు. పూర్వం కిరస్తానీ పాఠశాలోని ఓ తెలుగుపంతులు ఈ ఆంజనేయస్వామి గుడిలో పురాణం చెబుతుండేవాడు. ప్రతిశనివారం, అలా రెండేండ్లు ఆయన పురాణం చెప్పాడు. హిందువుల గుళ్లల్లో పురాణం చెప్పే ఆయన మా పాఠశాలలో పనిచేయకూడదని ఆ రెండేండ్లు ఆయనతో కిరస్తానీ యాజమాన్యం అంటూ వచ్చింది. ఆ మాటలు ఆయన ఖాతరు చేయలేదు. చివరికి ఆయనకు తెలుగుపండిట్ ట్రయినింగులేదని, మరో లేనిపోని నేరం కల్పించి ఉద్యోగం నుండి తొలగించారు. ఆయన బతుకు తెరువు వెతుక్కొంటూ ఎక్కడికో వెళ్లిపోయారు. అప్పటినుండి ఆంజనేయస్వామి గుడి కళ దప్పింది. ఇప్పుడు ఎల్లమ్మ గుడికి మారుతి గుడికి మధ్య మేరెమ్మ గుడి వెలుస్తున్నది. గోడలు లేచినై. కప్పు పడుతున్నది. ఊరిలో సువార్త కూటములు జరుగుతున్నాయి. ఎల్లమ్మ గుడికి వెళ్లేవారి విశ్వాసాల మీద దెబ్బకొడుతున్నారు. ఆంజనేయస్వామి గుడికి వెళ్లితే పీడకలలు పడి పిచ్చోళ్లవుతారని ప్రచారం చేస్తున్నారు.



ఊళ్లో ఒకే ఒక్క బ్రాహ్మణ కుటుంబం ఉండేది. వారే వేయి గజాల స్థలంలో ఉన్న ఆంజనేయస్వామి ఆలయం మంచిచెడ్డ చూసేవారు. ఊళ్లోని హరిజనులు తప్ప అందరూ ఆ గుళ్లోని మంటపంలో భజనలు చేసేవారు. హరిజనులు గుడిబయటనుండే ప్రసాదాలు తీసుకొనేవారు. మిమ్మల్ని గుడిలోకిరానియ్యనివారి మతంలో మీరెందుకుండాలి అని కిరస్తానీలు ప్రచారం ప్రారంభించారు. వాళ్లా ఊళ్లో స్థాపించిన పాఠశాలలో సగానికి పై చిలుకు హిందువులే టీచర్సుగా ఉన్నారు. మిగతా కిరస్తానీ టీచర్లు, ఓ ఫాదర్ బాగా వర్క్ చేశారు. అందువల్లనే ఆంజనేయస్వామి, ఎల్లమ్మ గుడి మధ్యస్థలం సంపాదించారు. ఊరిపెద్దలు ఏ దేవుని దేవత గుడికైనా సాయం చేసే ధర్మబుద్ధి ఉన్నవాళ్లు.

అంతాసరేగాని ఈశ్వర్‌లాంటి పదేళ్ల కుర్రాని విశ్వాసాన్ని చెడగొట్టడమేంటి! ఎల్లమ్మ గుడిముందు నిలబడి బొట్టుపెట్టుకొని దండం పెట్టుకొంటున్న ఆ అబ్బాయి రెక్క పట్టుకొని కూలబెట్టి 'ఎల్లమ్మను పూజిస్తే దయ్యాలై పుడతా'రని చెవినిల్లుగట్టుకొని పోరడమేంటి?

ఈశ్వర్‌లాంటి పదిమంది పిల్లలకు ఏది శాస్త్రమో, ఏది శాస్త్రంకాదో వివరించి చెప్పాడు వెంకటరమణ. పుట్టుకలమీద ఏ దేవీ దేవతల ప్రభావాలుండవని వివరించాడు. హిందువుల గుళ్లకు వాళ్ల పిల్లలు వెళ్ళకుండా చేయడానికే కిరస్తానీలు ఎన్నుకున్న ప్రచారం ఇది అని బోధించాడు. ఇదివారి కుటిలబుద్ధి అని అందరికీ చెప్పాడు. ఇంటింటికీ తిరిగి కిరస్తానీల అంతరంగం వెనుక ఉన్న విషవ్యూహం వివరించాడు. ఆరోజు నుండి ఆంజనేయస్వామి గుడిలో భజనలు ప్రారంభమైనై. ఎల్లమ్మ గుడిముందు కోలాటం వేశారు. ఎల్లమ్మ గుడికీ ఊరి పెద్దలు నూరుగజాలు కేటాయించారు.

పరశురాముని తల్లే రేణుక. రేణుకే ఎల్లమ్మ. పరశురాముడవతార పురుషుడు. ఎల్లమ్మ తల్లి ఎల్లరి దేవత. ఈ ప్రచారంతో అందరూ ఎల్లమ్మ గుడికి రావడం మొదలైంది. హరిజనులు కూడా ఆంజనేయస్వామి గుడికి వెడుతున్నారు. తమ ప్రచారం హిందువుల్లో ఏకతను పెంచడంతో కిరస్తానీలు తోకముడిచారు. కాని ఎదురుదెబ్బ తాకితేకాని లేవని మనస్తత్వం హిందువుల్లో ఇంకెన్నాళ్లు! వెంకటరమణలాంటివారు ఆలోచనలో పడ్డారు.

## 26. బతుక్కి అర్థమా! పరమార్థమా!

'నెల పూర్తికాకముందే ఇన్ని డబ్బులు అడ్వాన్సు తీసుకుంటే నీకు జీతమేం వస్తుంది' అడిగాడు జగన్నాథ్.

'ఏం చేయాలి సార్ ఆ పోలీసు కేసొకటి వచ్చిపడింది' తల వంచుకొని అన్నాడు శ్యాంప్రసాద్.

'నీ ఇష్టం మరి, నెలమీద జీతమని మళ్లీ అడగరాదు' అంటూ మూడువందలిచ్చాడు జగన్నాథ్.

శ్యాంప్రసాద్ వెళ్లిపోయాడు.

తమ భక్తిగీతాల గ్రంథం ప్రచురణ నిమిత్తం అక్కడికి వచ్చి ప్రూఫులు చూచుకొంటున్న ఫాదర్ ఆసక్తిగా ప్రొప్రయిటర్ జగన్నాథ్, వర్కర్ శ్యాంప్రసాద్ మాటల్ని వింటున్నాడు. శ్యాంప్రసాద్ వెళ్ళిపోయింతర్వాత ఫాదర్ జగన్నాథ్‌ను కదలించగా కొన్ని విషయాలు తెలిశాయి.

తల్లితోపాటు కృష్ణాజిల్లా వదలిపెట్టి అయిదు సం॥ల క్రితం హైదరాబాదు వచ్చాడు శ్యాం. ప్రెస్సులో పనిచేస్తూ తల్లి తాను బతుకుతున్నారు. ఓ స్లం ఏరియాలో వందరూ॥ల కిరాయికే ఓ చిన్నగది దొరకగా అందులో నివాసం పెట్టారు. శ్యాం ప్రెస్సులో నెలకు పదిహేనువందలు సంపాదిస్తున్నాడు. ఓ కొట్టులో ఖాతాపెరిగిపోయి మూడువేలు దాటింది. వాడు దానికి వడ్డీ కూడా వసూలు చేస్తున్నాడు. ఇతను కట్టలేకపోతున్నాడు. అసలు తేరడం లేదు, వడ్డీ పెరిగిపోతున్నది. ఇద్దరు ఘర్షణ పడ్డారు. ఇతణ్ణి పోలీసులు పట్టుకొని వెళ్లారు. ఇది వరకే రెండువందల లంచం తిన్నారు. ఇప్పుడు మరో మూడువందలిస్తే వదలేస్తామన్నారు. తీసుకొని వెళ్లాడు.

ఫాదర్ శ్యాం అడ్రస్ తీసుకొన్నాడు. చిలకల గూడా పోలీస్ స్టేషన్‌కు శ్యాంను తీసుకొని వెళ్లాడు. ఆ వ్యాపారిని పిలిపించాడు. తనకు తెలిసిన ఓడిఎస్పీచేత ఆ



పి.ఎస్‌కు ఫోన్‌చేయించాడు. ఆ వ్యాపారి రెండువేలు తీసుకొని ఖాతా పాటాగొట్టడానికి ఒప్పుకొన్నాడు. ఫాదర్ ప్రవేశంతో పోలీసులు కూడా ఆ మూడువందల లంచం తీసుకోలేదు.

శ్యాంకృతజ్ఞతతో ఫాదర్‌కు నమస్కరించాడు. "మీమేలు మరువలేను సార్. నెలకు రెండువందల చొప్పున పది నెలల్లో మీరెండువేలు తీర్చివేస్తాను సర్' అన్నాడు శ్యాం.

'ఆ డబ్బు నేనివ్వలేదు' అన్నాడు నవ్వుతూ ఫాదర్.

ఎవరిచ్చారన్నట్టు చూశాడు శ్యాం.

'ప్రభువిచ్చాడు' గంభీరంగా అన్నాడు ఫాదర్.

'ప్రభువెవరు?' ఆశ్చర్యంతో అడిగాడు శ్యాం.

'నా వెంబడిరా' అంటూ ఫాదర్ స్కూటరెక్కాడు. అతని వెనుక కూచున్నాడు శ్యాం.

మెట్టుగడ్డ చర్చి దగ్గర స్కూటరాగింది. ఫాదర్ చర్చిలోకి నడిచాడు. శ్యాంమౌనంగా అతణ్ణి అనుసరించాడు.

శిలువమీది క్రీస్తుబొమ్మను చూపిస్తూ.. 'ఇచ్చింది ఆ ప్రభువే, ఆయనకు మనమేం ఇస్తాం, మనం ఆయన్ని నమ్ముకోవాలి గాని ఇంకా ఇస్తాడు. నీకు ముందు ముందు మూడువేల జీతం కూడా చేస్తాడు... రా ఇలా కూచో, శ్యాంను కూచోబెట్టి ఓ బైబిల్‌తెచ్చి అతని చేతపెట్టాడు. ఏం మాటాడకుండా అలాగే బైబిల్ తెరిచి కొంతసేపు చూశాడు శ్యాం. ఓ అరగంట తర్వాత ఫాదర్ వచ్చి ' మీ యింటి దగ్గర దిగపెడుతానురా' అన్నాడు. స్కూటర్‌మీద శ్యాంను కూచోబెట్టుకొని 'స్లం'లోని అతని ఇంటిదగ్గర దించి, 'చర్చికి వస్తుండు... ప్రభువు దయచూపుతాడు' అంటూ వెళ్లిపోయాడు.

శ్యాం ఆ నెలలో తనకు రావాల్సిన రెండువందల రూ॥లు మాత్రమే ప్రెస్ ఓనర్ జగన్నాథ్ దగ్గర తీసుకొన్నాడు. మరో అయిదువందలు ఓనర్ ఇస్తుంటే

కూడ వద్దన్నాడు. మొన్న మూడువందలిస్తూ కొద్దిగా మందలించినందుకు ఏమైనా అనుకొన్నాడనుకొని దగ్గరికి పిలిచి అడిగాడు. ఫాదర్‌గారి సహాయం గురించి వివరంగా చెప్పాడు శ్యాంప్రసాద్.

మరో రెండు నెల్లకు మెడలో శిలువతో కనిపించాడు శ్యాంప్రసాద్. ఓనర్ జగన్నాథ్ నిష్ఠ ఉన్న హిందువే. ఫాదర్ ఒక వ్యూహం ప్రకారం శ్యాంను బుట్టలో వేసుకొన్నాడనుకొన్నాడు. శ్యాం తెలివి గలవాడు; అతనితో ఒక మాట చెప్పాలని నిశ్చయించుకొన్నాడు. 'చూడు శ్యాం! ఆ ఫాదర్ నిన్ను ఒక ప్రణాళిక ప్రకారంగా మతం మార్చాడనుకొంటున్నాను. నీవు తెలివిగలవాడవు. ఆ ఫాదర్ ఉంటున్న పరిసరాల్లో క్రైస్తవులుగా మారిన రిక్షాపుల్లర్లు, రోడ్లు ఊడ్చేవారు, ఇండ్లలో పనిబాటలు చేసేవారు, కూరగాయలమ్మేవారు, సైకిళ్ల రిపేర్ చేసేవారు, పాతకాగితాలు కొని అమ్మేవారు, ఇల్లిల్లు తిరిగి ప్లాస్టిక్ సామానులు అమ్మేవారు... ఇలా ఎందరో బీదలుండి ఉంటారు కదా! మారిన వారికి కూడా ఆ ఫాదిటువంటి సహాయం చేస్తున్నాడా! చేస్తే అతనికి డబ్బు ఎక్కడినుండి వస్తుంది. ఒకవేళ అది విదేశీధనమే అయితే ఈ దేశంలో క్రైస్తవాన్ని పెంచాలనే కుట్రలో ఇది ఒక భాగం కాదా.... నీవు ఫిలాసఫీ నమ్మిమారితే నేనేమనను... కాని ఇన్ని విధాలుగా ఆలోచించి చూడు!' అన్నాడు జగన్నాథ్.

శ్యాం ఆ రోజునుండి ఆరా తీయడం మొదలెట్టాడు.

ఓ రిక్షాపుల్లర్‌కు నలుగురు బిడ్డలు, నలుగురూ ఓ పది ఇండ్లల్లో పనిచేస్తారు. జీవితాలు దుర్భర దారిద్ర్యంలో మ్రగ్గుతున్నాయి. భార్య అనారోగ్యంతో ఎప్పుడూ మంచంలోనే ఉంటుంది. ఈమె కిరస్తానీ, ఆకారణంగా పదిహేనేళ్ల క్రితం మతం మారాడు. అప్పుడు కిరస్తానీలు బట్టలిచ్చారు, కానుకలిచ్చారు. ఆ తర్వాత వారికెటువంటి సహాయమూ అందలేదు.

అయిదారు ఇండ్లల్లో పనిమనిషిగా పనిచేస్తున్న ఓ ఏబయియేళ్ల మహిళ జీవితాన్ని అధ్యయనం చేశాడు. కొడుకూ కోడలు ఆమెను వదలిపెట్టి ముంబాయికి వెళ్లిపోయారు. వారిద్దరు అక్కడ ఓ స్టూడియోలో టెక్నిషీయన్స్. ఈమె ఒంటరి. ఓ ఫాదర్‌గారు కొన్నాళ్లపాటు ఈమెను చేరదీసి వదిలివేశారు. ఇరవైయేళ్ళ



వయస్సులో అతని దగ్గర ఉన్నప్పుడే అబ్బాయి పుట్టాడు. ఇప్పుడాయన మరో యువతిని చేరదీశాడు.

ఇటువంటి పేద కిరస్తానీ చరిత్రలు ఒక వంద వరకు సేకరించాడు శ్యాం ప్రసాద్. ఈ విషయాలన్నీ జగన్నాథ్‌కు చెప్పాడు. తనను కొనడానికి ఫాదర్ వ్యాపారికిచ్చిన రెండువేల రూ॥లు తన మెడలోని శిలువ ఫాదర్ చేతుల్లో పెట్టి, నేనిప్పుడు స్వేచ్ఛా మానవుణ్ణి, హిందుత్వంలో నాకు నిండు స్వేచ్ఛ ఉంది అంటూ వచ్చేశాడు.



## 27. పరాభవాల పరంపరలో మరొకటి...

'అరేయ్! వాడేం దేవుడురా ఆ బాబా బొమ్మను చించెయ్‌రా:' ఓ కిరస్తానీ పెద్దమనిషి ఆదేశం.

ఇరవైయేండ్ల యువకుడా పనిచేశాడు.

'ఆపటాలు పగలగొట్టుండ్రా'! మరొకరి ఆజ్ఞ.

అంతే అయిదార్గురు గోడలకున్న పటాలన్నీ పగులగొట్టారు.

గణేశుని చిన్న బొమ్మ ముక్కలయింది. కొన్ని పటాలు మురికి కాల్వలో కొట్టుకుపోయాయి. కొన్ని కాలిపోయాయి. గోడమీద ఉన్న ఓంకారంలో శిలువ చోటు చేసుకొంది. స్వస్తిక్ చిహ్నాలకు చేతులు అడ్డం మొలచినై.

స్కెచ్‌న్నుతో ఒకడు లక్ష్మీపార్వతీసరస్వతుల చిత్రాలకు మీసాలు పెట్టాడు. అందరూ పగలబడి నవ్వారు.

ఆవేసుకొన్న బట్టలు విప్పరావు గానీ లేకపోతే మనవాడు విప్పేవాడే 'ఓ కిరస్తానీ' అన్నాడు కిసుక్కున పెదవులు కొరుక్కుంటూ.

1995 ఫిబ్రవరి 2వ తేదీ కిరస్తానీలు హుజూరాబాదులోని వర్తక సంఘభవనంలో తెల్లవార్లూ భజనలు చేసి వెళ్లేముందు ఇలాంటి కిరాతకాలు చేశారు. వారు వెళుతున్నారు ఆ భవనంలోని ఒక గదిలో బసచేయడానికి అప్పుడే అటువైపు నుండి ఆత్మానందస్వాములవారు వస్తున్నారు.

**'నేను పది బొమ్మలను చించేసిన'**

**'నేనో అయిదారు పటాలను కాల్చేసిన'**

**'నేనో దేవునిమీద ఉమ్మేసిన'**

**'నేనో దేవతమీద... పోసిన'**

భవనం దగ్గరికి వచ్చిన స్వాముల వారిచెవిలో ఈ మాటలు పడినై. ఇంకావారేమోమో వాగుతున్నారు.



ఈ కిరస్తానీలు వర్తక సంఘభవనంలోకి ఎందుకు వచ్చారో స్వాములవారికి అర్థం కాలేదు. ఆయన ఆలోచిస్తూ భవనంవైపు నడిచారు.

వర్తక సంఘభవనంలోని హాల్‌పెళ్ళిళ్లకూ, పేరంటాలకు, పుట్టినరోజులకూ, సత్సంగాలకూ, సభలకూ, సమావేశాలకూ కిరాయికిస్తుంటారు. ఆ రోజురాత్రి క్రిష్టియన్లు భజనలకు వర్తక సంఘభవనం కావాలంటే కిరాయికిచ్చారు. ఎబయి అరవైమంది వచ్చి రాత్రంతా భజనలు చేశారు. తెల్లవార్లూ హిందూదేవుళ్ల చిత్రాలకు తమ భజనలు వినిపించారు. ఒక్కదేవత ఒక్కదేవుడు కూడా సజీవులైరాలేదు, భజనల్లో పాల్గొనలేదు, తాము మతం మారుతామనలేదు. కిరస్తానీల్లో కొందరికి కోపం వచ్చింది. ఈ పిచ్చిపనులన్నీ చేశారు. మిగతా అందరూ ఇదొక వినోద క్రీడగా ఆనందించారు. ఎవరిమీదనో కసి తీసుకొన్న బాపతుగా కొందరు కనిపించారు.

భవనంలోకి అడుగుపెట్టిన ఆత్మానందస్వాములవారికి అర్థమైపోయింది. అప్పుడే అరఫర్లాంగు దూరం వెళ్లిపోయిన కిరస్తానీలను వారు వెంబడించారు. స్వాములవారిని చూచి యువకులు గబగబా పరుగెత్తినంత పనిచేసి వెళ్లిపోయారు. అందరికన్న వెనుకగా ఉన్న ఫాదర్‌ను నిలదీశారు స్వాములవారు.

'ఎందుకు చేశారీ పిచ్చిపని' స్వామి ప్రశ్న

'ఏం పిచ్చిపని' ఫాదర్ ముఖంలో పరమ అమాయికత.

'హిందూ దేవుళ్ల పటాలను మీవారు చించారు, పగలగొట్టారు,

కాల్వారు వీధిలో విసరేశారు... ఈ పిచ్చిపనుల విషయమే నేను అడుగుతున్నది' ... స్వామి దబాయింపు ఆగ్రహం.

'ఓహ్! అదా ఎవరో కొంటెపిల్లలు చేశరానుకొంటా!' చాలా తేలికగా ఫాదర్ చప్పరింత.

'నీ గురుబోధలు వింటూ ఇటుగా ఇప్పుడు వెళ్లిన ఆ కొంటె పిల్లలేకదా!' స్వామి సూటి ప్రశ్న.

'ఏదో జరిగిందేదో జరిగిపోయింది క్షమించండి! 'ఫాదర్‌తల వంచాడు. 'నీభార్యను ఓ కాముకుడు గిల్లుతాడు, రక్కుతాడు....' ఇలాగే అంటావా స్వామి ఆగ్రహం.

ఈలోగా కిరస్తానీల జీపొకటి వచ్చింది, ఫాదర్ అందులో వెళ్లిపోయారు.

ఆత్మానందస్వాములవారు అప్పటికప్పుడే వర్తక సంఘం అధ్యక్షులను కలిశారు. వర్తకులందరూ సంఘ భవనానికి వచ్చారు. అయిదార్గురు వెళ్లి పోలీస్ స్టేషన్లో రిపోర్టు ఇచ్చారు. కిరస్తానీ ఫాదర్‌మీద కొంతమంది యువకులమీద కేసు నమోదయింది.

ఆ తర్వాత తెలిసింది....

ఆ రోజురాత్రి భవనం వాచ్‌మెన్‌కు ఏదైనా తెచ్చుకొని తాగమని ఓ కిరస్తానీ పెద్ద పదిరూపాయలిచ్చాడు. వాచ్‌మెన్ ఆ డబ్బులు తీసుకొని భజన కార్యక్రమం కదా ఏ గొడవా జరగదని ఇంటికి వెళ్లిపోయాడు. అతనూ ఉదయం వచ్చిచూచి బిక్కుబిక్కుమంటూ ఓ మూలనిల్చుండిపోయాడు. ఆ చుట్టుపక్కల ఇండ్లవారు చెప్పారు. తెల్లవార్లు తాగిన వాళ్లలా విపరీతంగా అరిచారని.

నోరు నొవ్వంగ దేవుణ్ణి గురించి అరవనీ, ఎవ్వరేమనరు! కానీ అసహనమేమిటి! దేవుళ్ల చిత్రపటాలేమన్నాయి!

క్రీస్తుపరమత చిహ్నాలనీ విధంగా పేల్చండని, కాల్చండని, కూల్చండని చెప్పాడా!

ఇది వీధి మానిసి ప్రశ్న.

హుజూరాబాద్ హిందూవాహిని కార్యకర్తలు ఈ విషయాలన్ని ఇంటింటికీ ప్రచారం చేశారు.

'చెప్పుకోకండి అది మనకే అవమానం.....' ఓ హిందువు ఉవాచ.

'చెప్పడం కాదు అలా మనమూ చేయాలి-కుక్కకాటుకు చెప్పుదెబ్బ' ఓ యువకుని ఆగ్రహం.

'వాడు పియ్యిదిన్నాడని మనమూ దింటామా!' ఓ తాతగారి ఎదురు ప్రశ్న.

'కుట్టకపోతే తేలును గూడా కుమ్మరి పురగనుకొంటారు...' ఓ పంతులుగారి మాట.

అంతే ఎవరికివారే యమునాతీరే! ఇది హిందూ సంఘటనం. పార్థా! పరాక్రమించు అనిపిలుస్తున్నాడు మరి డేవిడ్ ఫ్రాలే.



# 28. ప్రేమ నేపథ్యంలో దయ్యాల నాట్యం

'మా అబ్బాయి కృపాకర్‌కు మీ హిందూ ఆచారాలంటే ఎంతో ఇష్టం' అన్నది గత ఏడాదిగా పక్కింట్లో కిరాయికి ఉన్న దయామణి పార్వతమ్మతో.

దయామణి గవర్నమెంటు హాస్పిటల్లో నర్సు. పార్వతమ్మ గృహిణి, పంచాయతీ కార్యాలయంలో ఆమెభర్త రామలింగేశ్వరరావు మేనేజర్. దయామణి భర్త సుగుణాకర్ ఆ తాలూకా సెంటర్లోని గ్రంథాలయంలో పనిచేస్తుంటాడు.

ఈ యేడాదికాలంలో అంతగా ఈ రెండు కుటుంబాలు దగ్గరకాలేదు. కారణం పార్వతమ్మ హిందువు; దయామణి కిరస్తాని.

ఈ విషయం ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. ఉప్పుపప్పు చేబదుళ్లు కూడా ఇచ్చిపుచ్చుకోని విధంగా ఉన్నారు. ఇవాళ ఒక్కసారిగా దయామణి అలా అనే వరకు పార్వతమ్మకు ఆసక్తి పెరిగింది.

'ఏ ఆచారాలు!' ఏదో ఒకటి అడగాలి కదా అని అడిగింది.

'ఇంటిముందు ముగ్గులువేయడం, కడపలకు పసుపు కుంకాలు రాయడం, నొసటన బొట్టుపెట్టుకోవడం, చీరచక్కగా కట్టుకోవడం, ఎవరింటికైనా వెళ్లినప్పుడు పూలే-ఆకులూ-పళ్లు తీసుకొని వెళ్లడం... ఇలా ఎన్నో!'... ఆగింది దయామణి.

'ఇవన్నీ ఆచారాలు కావు; ఇంటిలోకి హానికరమైన రోగక్రిములు రాకూడదని సున్నం లక్షణమున్న ముగ్గువేస్తారు; పిండి వేస్తే చీమలకాహారమవుతుందని వేస్తారు; పసుపు కుంకాల్లో రోగనిరోధకశక్తి ఉంటుంది. కాబట్టి ద్వారం దగ్గర వాటితో అలంకరించడం వల్ల కొన్ని క్రిములు రావనే దృష్టి ఉంది. ఇదీ ఆరోగ్యానికి సంబంధించిందే. ఈడ-పింగళసుషుమ్న నాడులు కనుబొమల మధ్య కలుస్తాయి కాబట్టి అక్కడ తిలకం పెడితే నాడీ రక్షణ అని ఆయుర్వేదవైద్యం చెబుతుంది. ఇదీ ఆరోగ్యదృష్టితో వచ్చిందే. బిగుతు వస్త్రాలు కట్టుకొంటే అసౌకర్యంగా ఉంటుంది, అంగాంగ ప్రదర్శన జరుగుతుంది, అందుకే చీరధరించడం, ఇకపూలూ-ఆకూ-

పళ్లు అనేవి, చిన్న పిల్లల దగ్గరికి పెద్దవాళ్ళదగ్గరికి వెళ్ళినప్పుడు వారి తృప్తికొరకు మర్యాదగా తీసుకొని వెళ్లేవి.

ఇవేవీ ఆచారాలు కావు! మీరు కూడా ఏదో ఒక రూపంలో ఈ మర్యాదలన్నీ పాటిస్తూనే ఉన్నారు కదా!' అన్నది పార్వతమ్మ తన శ్రుతపాండిత్యానికితానే మురిసిపోతు.

దయామణి 'డంగై' నిలిచింది. అయినా ఆమె ప్రణాళిక పార్వతమ్మ ముందుంచాలనే ఉద్దేశ్యంతోనే ఈ ప్రస్తావన తెచ్చింది.

'పెళ్ళిళ్ల విషయంలో మావాడికి మీ పద్ధతే నచ్చుతుంది...

వాడు తన మేనమరదలిని చేసుకోనని మొండికేస్తున్నాడు' అంది దయామణి.

'ఎందుకు!' అడిగింది పార్వతమ్మ.

'ఏముంది ఈ కిరస్తానీ కల్చర్‌లో ఎదిగిన అమ్మాయిలు స్వేచ్ఛగా తిరుగుతారట. అదివాడికి నచ్చదట...' అంది దయామణి.

'తప్పేముంది! మా అమ్మాయిలు కూడా స్వేచ్ఛగానే తిరుగుతున్నారు...' అంది పార్వతమ్మ.

'అయినా మీ నియమాల్లో వారు ఒదిగి ఉంటారు కదా!'... ఇది మావాడి ఆలోచన.

మెడిసిన్ చేస్తున్న మీ పెద్దమ్మాయి అంటే మావాడికెంతో ఇష్టం; వీడి ఎం.బి.ఎ కూడా ఈ యేడు పూర్తవుతుంది' అన్నది దయామణి.

ఇదెక్కడికో తీసుకొనిపోయేట్టుంది అనుకొని 'ఇంట్లో పనుందమ్మా' అంటూ వెళ్లిపోయింది పార్వతమ్మ.

ఆరోజు సాయంకాలం పట్టణం నుండి పార్వతమ్మ పెద్దమ్మాయి వచ్చింది. రాత్రిపడుకొనే ముందు "ఈ పక్కింటి దయామణి కొడుకెక్కడైనా నీకు తారసపడుతుంటాడా!' అడిగింది పార్వతమ్మ. అమ్మాయి పక్కున నవ్వి 'ఏమిటి కథ' అని అడిగింది. ఆ సాయంకాలం దయామణి అన్నమాటలన్నీ చెప్పింది.



'అవును పట్టణంలో గత ఆర్నెలలుగా అతను నాతో కలవడానికి మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్ల మేనమరదలును పెళ్లిచేసుకోవడం ఇష్టంలేదని ఓసారి చెప్పాడు. మీలాంటి హిందూ అమ్మాయిని పెళ్లిచేసుకోవాలని ఉంది అన్నాడు. నాకూ మా మేనబావతో ఎప్పుడో పెళ్లికుదిరిపోయిందని అబద్ధమాడేశాను' అంది పార్వతమ్మ పెద్దమ్మాయి.

'వాళ్లు కాదనుకొంటున్న ఆ అమ్మాయికి ఇరవై రెండుంటాయేమో! అయినా ఇంకొకరి కొరకు ఆ అమ్మాయిమీద అభాండాలు వేయడం మంచిది కాదుకదా' అంది పార్వతమ్మ.

'ఆచారాలు లేవు; ప్రేమాలేదు-దోమాలేదు; ఇలా లైన్ వేసి ఓ విద్యావంతురాలు సంపాదన పరురాలైన హిందువును తమమతంలో కలుపుకొనే ఎత్తులేఇవి! మతపిచ్చిగాళ్లకు ప్రేమలు కూడా ఉంటాయా! అదంతా నటన. ఈ దేశంలో మతాంతరీకరణ షడ్యంత్రం ముసుగులో ఆడే నాటకం-బూటకం. మతసామ్రాజ్యవాదికి విస్తరణ కాంక్షతప్ప మరే ఆలోచన ఉండదు... అందులో ఈ కోన్‌కిస్కా గొట్టంగాడొకడు పడుకోవే...' అంది అమ్మాయి.

●



# 29. గొర్రెలవుతారా! సింహాలుగా ఉంటారా?

'మన ఇంటివెనుకరోడ్డులో' వేసవి సెలవుల్లో బాలవిహార్' అనే ఓ బ్యానర్ వెలసింది చూశారా' అడిగింది భర్తను మాధురి.

'చూశాను అయిదారు రోజులుగా కనిపిస్తుంది' అన్నాడు శరత్‌కుమార్.

శరత్ ఓ ప్రైవేటు కంపెనీలో టైపిస్టుగా పనిచేస్తున్నాడు. మాధురి ఓ ప్రైవేటు స్కూల్లో టీచర్. డిగ్రీలు పూర్తిచేసి పెళ్లయ్యాక ఇద్దరు పిల్లలతో బ్రతుకుతెరువు కొరకు భాగ్యనగర్‌కు వచ్చిపడ్డారు. పేపర్ ప్రకటనల వెంటపడి ఇద్దరూ ఆ చిన్న ఉద్యోగాలు సంపాదించుకొన్నారు. ఆరునాల్గు సం॥ల ఇద్దరు పిల్లల్ని హబ్సిగూడాలోని ఓ ప్రైవేట్ స్కూల్లో చేర్పించారు. ఒకటిన్నర గదికి నెలకు ఆరువందల కిరాయిచెల్లిస్తూ కాలం ఈడుస్తున్నారు.

శరత్ వాళ్లున్న ఇంటికి మూడిండ్ల అవల ఆంజనేయస్వామి గుడిఉంది. గుడికి వెనుక భాగంలో మూడుగదులున్నాయి. ఆ గదుల్లో అరవై యేళ్ల పూజారి ఆయన ఇద్దరు కొడుకులు కోడళ్లు ఇద్దరు మనుమలు ఉంటున్నారు.

ఎండాకాలం సెలవుల్లో పిల్లలూరకే అటూ ఇటూ తిరుగుతారని, వారిని ఎంగేజ్ చేయాలని, గుడిలోని విశాల స్థలంలో బాలసంస్కార కేంద్రం పేరిట ఉదయం 6 గం॥లనుండి 7 గం. వరకు, సాయంకాలం 5 నుండి 7 వరకు, చుట్టుపక్కల పిల్లలందర్నీ జమచేసి ఉదయం గీతాపారాయణం, యోగ వ్యాయామం, సాయంకాలం ఆటలు, భజనగీతాలు, కథాకార్యక్రమం నిర్వహిద్దామని గుడిపూజారిని అడిగాడు శరత్.

'ఎవరు నిర్వహిస్తారు' అడిగాడు పూజారి.

'నేను, నాకు తోడునాభార్య, మీ అబ్బాయిలు సహకరిస్తే మంచిదే...' అన్నాడు శరత్.

'పిల్లలు వచ్చి ఈ గుడి ప్రాంగణంలో ఎగిరితే, దుమికితే రాళ్లు పరచిన



ఈ నేలంతా మట్టినిండిపోతుంది... ఇప్పటికే ఆపనిమనిషి గుణుస్తూ ఊడుస్తుంది; నెలకు రెండువందలరూ॥లిస్తున్నాం; మరో రెండు వందలిమ్మంటుంది' మెలికపెట్టాడు పూజారి. 'ఆమెసరే అంటే ఇద్దాం; లేకుంటే మనమే శుభ్రం చేసుకొందాం' అన్నాడు శరత్. 'పిల్లవాని ఒక్కొంటికి నీవు వసూలు చేసిన డబ్బుల్లో నాకు సగం ఇవ్వాలి... సూటిగా అడిగాడు పూజారి.

'మనం ఈ బాల సంస్కారకేంద్రం నిర్వహించేది ఈ ఎండాకాలం సెలవుల్లో నెలరోజులే! అందుకొరకు పదీ పరకా తీసుకోవడం బాగుండదండి! అదీగాక ఇంత మంచి పనికి డబ్బులతో ముడిపెట్టగూడదండి'! అన్నాడు శరత్ వినయంగా వివరిస్తున్న ధోరణిలో.

'ఓహో! అయితే నీవు ఆర్ఎస్ఎస్‌లో తిరిగావని అర్థమవుతున్నది; పిల్లలను ఒకదగ్గర చేర్చి ఇలా వారేచేయిస్తుంటారు...' అడిగాడు పూజారి.

'చిన్నప్పుడు శాఖకు వెళ్లేవాడినండి! ఇప్పుడేవైనా ఉత్సావాలకు వెడుతుంటాను' అన్నాడు శరత్.

'మీ బాల సంస్కార కేంద్రం ఈ గుళ్లో నడపనివ్వం. దీని మీద కాంగ్రెసోళ్ల పెత్తనముంది. ఈ కేంద్రం ఈ నెలరోజులు నడిచినా-ఒక్కరోజు నడిచినా అది ఆరెస్సెస్ వాళ్లే నడిపారన్న పేరు వస్తుంది. గుడి యాజమాన్యం నన్ను ఇక్కడి నుండి పంపివేస్తుంది. మా పిల్లలవి చిన్న నౌకర్లు (ఉద్యోగాలు). మేమెక్కడో కిరాయితీసుకొని ఉండలేం! పైగా ఈ కేంద్రం నడచినన్నాళ్లు నామీద మా కుటుంబంమీద ముస్లింలు, క్రిష్టియన్లు ఓ కన్నేసి ఉంచుతారు. ఆ తర్వాత కూడా వారు మాపైన పగబట్టి ఉంటారు. మా బతుకులేవో మమ్మల్ని బతకనియ్‌బాబు...' అనిదండంపెట్టాడు పూజారి.

శరత్‌నిరాశతో ఇంటికి వచ్చి మాధురికి సంగతంతా చెప్పాడు.

'మొదట డబ్బు అడిగాడు; అదికాదంటే తర్వాత ప్లేటు ఫిరాయించాడేమిటి!' ప్రశ్నార్థకంగా మొగం పెట్టింది మాధురి.

'సరేలే! మనం చేయని పని మరొకరు చేస్తున్నారు... సంతోషం...' అన్నాడు శరత్.

'ఈరోజే సాయంకాలం మనపిల్లలు వెళ్లారు. దేవదానం ఇంటిపక్క ఖాళీస్థాట్ చదునుచేసి, అక్కడ ఈబ్యానర్ కట్టారు. అయిదు రోజులుగా సాయంకాలం లెఫ్ట్‌రైట్లు, కదంతాళ్లు, అటూ ఇటూ పరుగెత్తడాలు, కోకో ఆటలు, చివరికి రెండు క్రిష్టియన్‌పాటలు, ఆ తర్వాత ఒక్కొక్కరికి రెండేసి చాక్లెట్లు.... ఇదీ అక్కడ నడుస్తున్న తతంగం....' అంది మాధురి.

'మనం అనుకొన్నాం, మనగుడి పిరికిమందు తాగింది; అందువల్ల చేయలేక పోయాం; వాళ్లు సాధించగలిగారు' అన్నాడు శరత్ నిట్టూరిస్తూ..

'ఆరెస్సెస్ శుభకార్యక్రమాలను తమపద్ధతిలో నడిపిస్తున్నారు' అంది మాధురి.

'అక్కడ చాక్లెట్లు, మిఠాయిలు పంచరు' అన్నాడు శరత్.

'ఇదో ఆకర్షణ'

'ఎంతమంది వెడుతున్నారు'

'అరవైమంది'

'ఏం చెబుతున్నారో వినాలి' అన్నాడు శరత్.

'మన అబ్బాయి చెప్పాడు. ఈ ఆటా-పాటా నడిపించే వ్యక్తి ఈ రోజే కథ చెప్పాడట. పూర్వం దయామయుడైన క్రీస్తు ప్రభువు ఇదే విధంగా గొర్రెల కాపరులతో కలిసి ఆడుకొన్నాడు... అని ఆ కథముగింపులో అన్నాడట. మనవాడు ఊరుకోక కృష్ణుడు ఆడుకొన్నాడండి! అన్నాడట. అతను వెంటనే కృష్ణుడెక్కడ ఆడుకొన్నాడు అతనువెన్నదొంగ, ఆడపిల్లల చీరలెత్తుకువెళ్లాడు అని మనవాని నోరుమూయించేశాడు....' మరీ వివరంగా చెప్పింది మాధురి.

'స్లాట్ హిందువులంది; వెళ్లేవాళ్ళందరూ హిందువుల పిల్లలే; ఆటా-పాటా పేరిట బాలవిహార్ ముసుగులో, రెండు గొర్రెలైనా వలలో పడకపోతాయా అన్న



ధ్యేయంతో ఒకటిరెండు మాత్రమే కిరస్తానీల ఇండ్లున్న చోట కార్యక్రమాలు మొదలు పెట్టారంటే వారి ధ్యేయం-దానిమీద వారికున్న నిష్ఠ మెచ్చుకోదగింది. గుడిసొమ్ముదింటున్న పూజారి లాంటి వాళ్లు గుర్తించదగ్గది...' శరత్ నిట్టూర్చాడు.

'రేపటినుండి మన పిల్లలతో మనమే గుడిప్రాంగణంలో సంస్కారకేంద్రం ఈ నెలరోజులు నడిపిద్దాం...' అంది దృఢంగా మాధురి.

'అవును! నడిపిద్దాం; మనపిల్లలు గాలివాటం గొర్రెలుకారాదు... సింహాలు కావాలి' అన్నాడు శరత్.



# ౩౦. అన్నిటినీ మరపించే కామపిశాచి!

'ఇప్పుడింటికి వెళ్లి వంటెవరు చేసుకొంటారు; హోటళ్లో తిని పెడదామా!' అంది టైపిస్టు సుగుణమణి ఆనందరావుతో.

'మీరు భోజనం చేయండి; నేను మీకు కంపెనీ ఇస్తాను; అంతే; ఇంటికి వెళ్లి తింటాను' అన్నాడు మర్యాదగా ఆనందరావు.

'ఒక్కరోజు ఇంట్లో తినకుంటే ఏం కాదులెండి! రండి' అంది సుగుణమణి. ఆమెననుసరించి హోటల్లో దూరాడు ఆనందరావు. కనిపించీ కనిపించని వెలుతురున్న ఆ హోటల్ డైనింగ్ హాల్లో ఓ మూల ఎదురెదురుగా కూచున్నారు సుగుణమణి ఆనందరావులు.

రెండు భోజనాలకు సుగుణమణే ఆర్డరిచ్చింది. 'అమ్మబాబోయ్!నేను మటన్‌తినను' అన్నాడు ఆనందరావు. 'మాంసం తిన్నంత మాత్రంలో మీ బ్రాహ్మణత్వం ఎక్కడికి పోదులెండి! తినండి!' అని ఆనందరావు చేయిలో తన చేయివేసి గట్టిగా ఒత్తింది సుగుణమణి. ఆ చెయ్యి ఆనందరావుకు వదలబుద్ధికాలేదు. భోజనం పూర్తయి బయటపడే వరకు రాత్రి ఏడుగంటలయ్యింది.

ఆరాత్రి సుగుణమణి ఇంటిలోనే గడిపాడు ఆనందరావు. తల్లీ సుగుణమణి ఇద్దరే ఆ రెండుగదుల అద్దెకొంపలో ఉంటున్నారు. ఆమె బైబిల్ చదువుతూ జపమాల తిప్పుతున్నది. ఆమె చిన్నతనంలో హిందువనీ, కాలేజీలో క్రిష్టియన్ కుర్రాడితో ఏర్పడ్డ పరిచయంతో మతాంతకరీకరణ-పెళ్లీ అలా అలా జరిగిపోయాయని ఆనందరావుకు తెలసింది.

ఆనందరావు సుగుణమణి ఇంటిలో వరుసగా మూడునిద్దర్లు చేసి తెల్లారింతర్వాత తన ఇంటికి చేరి భార్య ఇద్దరు ఆడపిల్లల్ని పైపైగా పలకరించి, రాత్రెక్కడ ఉన్నారీ మూడురోజులూ అని భార్య అడిగితే, ఇన్‌స్పెక్షన్ కారణంగా తానూ అధికారులతో లాడ్జిలో ఉండిపోవలసి వచ్చిందని అబద్ధమాడి దాటేశాడు. నాలుగోరోజు ఉదయం 9 గం.లకు పిల్లల్ని బడికి పంపి ఆనందరావుకు టిఫిన్



డబ్బా సర్దుతూ 'ఈ నాలుగోరోజు నిద్దురకూడా బ్యాంకులోనేనా' వ్యంగ్యంగా అడిగింది భర్తను భార్య రమాదేవి.

డైరీలో చిన్న చిన్న కాగితాలు సర్దుతున్న ఆనందరావు భార్యవైపు తీక్షణంగా చూశాడు.

'హోటల్ తిండి ఒళ్లు పాడుచేస్తుంది జాగ్రత్త' అన్నది రమాదేవి.

'ఇంట్లో తిండి బాగాలేకపోతే హోటల్లోనే తినాల్సివస్తుంది'. బ్రహ్మాండంగా విసిరాననుకొన్నాడు ఆనందరావు.

'పదేళ్లు బాగున్నది, ఈ మూడురోజుల్లోనే బాగాలేదా' ఎదురుదెబ్బతీసింది రమాదేవి.

తన సంగతి భార్యకు తెలిసిపోయిందని గ్రహించాడు ఆనందరావు. 'మగవాడన్నంక పదిదిక్కుల తిరుగుతాడు' అన్నాడు ఆనందరావు ఇక ముసుగులో గుద్దులాట ఎందుకని.

'ధర్మేచ, అర్థేచ, ........ మీరు మరిచిపోయినట్లే నేను మర్చిపోతే....' టిఫిన్ డబ్బా చేతికిస్తూ అంది రమాదేవి.

ఆనందరావుకు ఎదురుచూడని దెబ్బిది. ఒక్కసారి చెంపల్లోకి ఎరుపురంగు వచ్చేసింది. భార్య చెంపమీద ఒక్కటి అంటించాడు. 'నీ ఇష్టం... వచ్చినట్లూ నీవు తిరుగుపో' అన్నాడు ఇంట్లోనుండి బయటపడుతూ.

ఇక ఆరోజునుండి వరుసగా వారంరోజులు ఇంటికేరాలేదు ఆనందరావు. రమాదేవి ఇద్దరు పిల్లలను తీసుకొని ఉన్న వస్తువులు సర్దుకొని విజయవాడనుండి హైదరాబాదు వచ్చేసింది. తల్లిదండ్రులకు జరిగిన సంగతి చెప్పింది. తండ్రి కూతురుకు ధైర్యం చెప్పాడు. ఆమరుసటిరోజే, లెక్చరర్‌గా రిటైరై ఓ ప్రయివేటు కాలేజీలో పనిచేస్తున్న ఆనందరావు తండ్రిని తీసుకొని విజయవాడ బయలుదేరాడు. ఆనందరావును కలిశాడు. భార్యాపిల్లలు తనకక్కరలేదని డైరెక్టుగా చెప్పేశాడు ఆనందరావు.

"రమచేత డిగ్రీపూర్తిచేయించి ఏ ప్రైవేటు స్కూల్లో నైనా ఉద్యోగం చేయించవచ్చు. పిల్లలను మంచి స్కూళ్ళలో వేయవచ్చు. కాలుజారడం నేరం కాదు; కాని కాలువెనక్కి తీసుకోకపోవడం నేరం. పైగా ఈ దేశంలో కిరస్తానీలు హిందువులను మతం మార్చడానికి ఎంతకైనా దిగజారిపోతున్నారని ఈ మధ్యనే ఓ మిత్రుండంటుంటే విన్నాను. అదే నిజమైతే రానురాను దేశమంతా క్రైస్తవ మయమైపోతుందేమో అనిపిస్తుంది. ఆ కిరస్తానీ ఉన్నచోట ఉండకూడదనుకొంటే ప్రయత్నంచేసి బదిలీ చేయిస్తా. ఏ ఆధారంలేని మా అమ్మాయి ఇద్దరాడపిల్లలతో ఎలా... ఈదుకు వస్తుంది' చాలా అనునయంగా సముదాయింపు ధోరణిలో అన్నాడు రమాదేవి తండ్రి.

'నాకు భార్యాపిల్లలు అక్కరలేదు!' తెగేసిచెప్పాడు ఆనందరావు.

'మరి ఎందుకు పెళ్లిచేసుకొన్నావ్' అడిగాడు రావు తండ్రి.

'బుద్ధి గడ్డి తిని... మీరేకదా బలవంతాన అంటగట్టింది.'

మీదగ్గరే ఉంచుకోండి. నేనీమెను పెళ్ళిచేసుకోబోతున్నాను.....' అని ఎవరి మాటను ఖాతరు చేయకుండా వెళ్లిపోయాడు ఆనందరావు.

ఇది జరిగి ఇప్పటికి పదేళ్లు. రమాదేవి ప్రైవేటు స్కూల్లో టీచర్‌గా చేరింది. పిల్లలు ఇంటర్మీడియట్ పూర్తి చేశారు. తనకాళ్లమీద తాను నిలబడింది. తండ్రి మనోవర్తి దావా వేస్తానంటే కూడా వద్దంది. రెండేళ్ల క్రితం ఆనందరావును వదలేసి సుగుణమణి మరొకరితో ఉంటుంది.

ఇప్పుడు ఆనందరావు ఒంటరి, కిరస్తానీ భావాలు అతనిలో బాగా నాటుకొన్నాయి; ఇప్పుడు తనంతకు తానే మరో సుగుణమణికొరకు వేటాడుతున్నాడు.

"సఖాసప్తదాభవ, సఖయోసప్త పదా బభూవా, సఖ్యంతేగమేయుగం, సఖ్యాత్రేమాయోషగం, సఖ్యాన్మేమాయోస్సమాయువ సంకల్పావహై, సంప్రియోరోచిష్ణు-సుమనస్యమనే ఇషమూర్జమభినవ సాసంనౌ మనాంసి, సంవ్రతా సముచితా వ్యాకరం"



ఓ స్నేహితులారా! నాతో కలిసి నీ వేడడుగులు నడవడం వల్ల మిత్రులమైనామనీ... ఇక కలిసి నడుచుకొందాం అని ప్రతిజ్ఞ చేసిన సప్తపదిని ఆనందరావు మరచిపోయాడు. కామపిశాచి సప్తపదినే కాదు, మాతృమూర్తినీ మాతృదేశాన్ని కూడా మరిపిస్తుంది. కాని రమాదేవీ జననీ జన్మభూమిశ్చ... అంటూ తన పిల్లలను పెంచి పోషిస్తున్నది; విద్యా బుద్ధులు చెప్పిస్తున్నది.



# 31. బిందువు నుండి సింధువు దాకా!

బిందుమాధవి ఓ గళ్లకార్డు తెచ్చింది. ఆ కార్డునిండా వందగడులున్నాయి. ప్రతిగడిలో 5 రూ॥లు వ్రాసి సంతకం పెట్టాలి.

'అయిదు రూపాయలీగడిలో వ్రాసి సంతకం పెట్టు అంకుల్' అంది బిందు.

'దేనికొరకమ్మా కార్డు పరిశీలిస్తూ' అడిగాడు అంకుల్ నారాయణ.

'మానాన్న పెట్టాడు; అమ్మపెట్టింది; అన్నయ్యపెట్టాడు. మా పక్కింటి పిన్నిపెట్టింది... ఇట్లా 10 మంది సంతకాలుపెట్టి తలా 5 రూ॥లు ఇచ్చారు. ఇంకా తొంబయిమందిని కలిస్తేగాని నాకార్డులోని గళ్లునిండవు. అయిదువందల అప్పటికిగాని పూర్తిగావు. సంతకం పెట్టి 5 రూ॥లివ్వు అంకుల్ అంది మృదువుగా ఒత్తిడి చేస్తూ బిందుమాధవి.

'కుష్ఠురోగుల సేవకై విరాళం' అని రాసిఉన్న ఆ కార్డు మీద క్రాసు గుర్తుంది. ఆ అమ్మాయి సెయింట్ థామస్ స్కూల్లోచదువుతుంది.

'నీకీ కార్డెవరిచ్చారమ్మా' అడిగాడు నారాయణ.

'మాక్లాసుటీచర్ నన్ ఫెరీనా'

'ఏమని ఇచ్చింది'

'ఈ డబ్బుల ద్వారా గూడూరులో చర్చికడతారట. అందులోనే హాస్పిటల్ కడతారట. కుష్ఠురోగులకు వైద్యం చేస్తారట....' వివరించింది బిందు.

'హైదరాబాదు టు శ్రీశైలం రోడ్డులో ఉన్న గూడూరులోనా'

'నా కుతెలువదు'

'ఇట్లా ఈ కార్డులు మీ 7వ క్లాసులోని 40 మందికి ఇచ్చారా'

'అవును'



'అంటే మీ ఒక్క క్లాసులోని వసూలు 20 వేలన్నమాట'.

'కావచ్చు'

'మీక్లాసులో క్రిష్టియన్ లెందరుంటారు'

'మా క్లాసులో లేరు; ఆరోతరగతిలో మాత్రం ఇద్దరున్నారు;

'నలభైమంది హిందువుల అమ్మాయిలు తెచ్చే విరాళాలతో కిరస్తానీల చర్చి నిర్మాణమవుతుందన్నమాట' అన్నాడు నారాయణ.

నారాయణ జెడ్.పి. హైస్కూల్లో టీచర్. గూడూరులో తనకు తెలిసిన టీచర్లెందరో ఉన్నారు. వారిద్వారా తెలిసిన విషయాలు.

ఆరునెల్ల క్రితం ఆ ఊరిలోకి ఓ కిరస్తానీ వర్కర్ వచ్చాడు. అతను బస్సు స్టేజిదగ్గర నిలిచున్నరాజేంద్రతో పరిచయం చేసుకొన్నాడు. రాజేందర్ హాస్పిటల్‌కు వెడుతున్నట్టు తెలుసుకున్నాడు. తన భార్య ఫీవర్ హాస్పిటల్‌లో నర్సు ఆమెద్వారా మంచివైద్యం, మంచి మందులు అందుతాయని చెప్పాడు. రాజేందర్‌కు మందులిప్పించాడు. అతని జ్వరం అయిదారురోజుల్లోనే తగ్గింది. ఈలోగానే అతణ్ణి చర్చిఫాదర్ దగ్గరికి తీసుకొని వెళ్లాడు.

ఆ తర్వాత ఆ కిరస్తానీ వర్కర్ రాజేందర్ ఇంటికి రాకపోకలు సాగించాడు. రాజేందర్ వాళ్ల నాన్నకు చెప్పి 500 గజాల స్థలం ఇప్పించాడు. ఇక చర్చికి నిధులు ప్రోగు చేస్తున్నారు. హైదరాబాదులోని ఒకటిరెండు పాఠశాలలు నిధులు సమకూరుస్తామని వాగ్దానం చేశాయి.

వ్యక్తులు హిందువులు, భూమి హిందువులది, ధనమిచ్చేది హిందువులు. నిర్మాణమయ్యేది కిరస్తానీల చర్చి. తమది సేవాదృక్పథమని చెప్పడానికి ఆస్పత్రి ముసుగు.

రేపటినాడు మతాంతరీకరణలకు కేంద్రంగా మారబోయే ఈచర్చి నిర్మాణం ఆపగలమా! అని చర్చించాడు నారాయణ.

'దానంచేసిన ఆ భూమిలో రాజేందర్ [illegible] భాగంకూడా ఉంది.

అతనితో చర్చించవచ్చు"నన్నారు స్నేహితులు.

ఒకరిద్దరిని తీసుకొని నారాయణవెళ్లాడు. ఒకసారి దానం చేసింది. తిరిగి తీసుకోవడం సబబుకాదని రాజేందర్ తండ్రి తనతమ్మునికే చెప్పాడు.

ఈ విదేశ మతం మున్ముందు ప్రమాదకరంగా పరిణమిస్తుందన్న రాజేందర్‌గానీ, అతని తండ్రిగానీ వినలేదు.

నారాయణ వెనక్కు వచ్చేశాడు. బిందుమాధవి తండ్రిని కలిసి అమ్మాయి విరాళాలు వసూలు చేయకుండా ఆపగలిగాడు. ఆ అమ్మాయిద్వారా మిగతా అమ్మాయిలకు చెప్పించగలిగాడు.

అయితే అఫెన్సులో విదేశీయులుండి, స్వదేశీయులు డిఫెన్సులో పడడం నారాయణకు నచ్చలేదు. విద్యార్థుల్లో యువకుల్లో చైతన్యం నిర్మాణం చేసినప్పుడే విదేశీమతాలవారి కుతంత్రాలు ఆగిపోతాయని నారాయణ నిశ్చయించుకొన్నాడు. ఇప్పుడు నారాయణ ఉద్యోగంతో పాటు ఈ భావ ప్రచారం మొదలు పెట్టాడు. ప్రయత్నం చిన్నదే అయినా కోటిమంది నారాయణలు కలిస్తే కానిదేమిటి?

●





# 32. పరమేశా!..... పార్వతిచాలున్

"ఇప్పుడు నీ వయస్సు ముప్పయి; నీ భార్య వయస్సు ఇరవై అయిదు. విడాకులు తీసుకోవాలనుకొంటున్నారు. సంతోషమైన పనేనా ఇది. అయిదేళ్ల మీ అబ్బాయి ఎక్కడైనా ఉంటాడంటున్నారు. ఆమెను నీవు తిట్టావు కొట్టావు అని పోలీసు కేసు పెట్టింది. నేను నీ భార్యను చాటుగా అడిగాను-మీవారు నిన్ను హింసించారా అని. ఆమె హింసించలేదని చెప్పింది. నీవు మరొకరితో తిరుగుతున్న కారణంగా ఆమె ఈ నిర్ణయం తీసుకొన్నదని తెలిసింది. నిజానికి నీవూ మీ అమ్మ (అంటె ఆమె అత్తగారు) తనను ఎంతో ప్రేమతో చూస్తారని చెప్పింది. నీవు మరొకరితో తిరగడమే ఇంతచేటు తెచ్చింది. ఆలోచించు ఈ తిరుగుడు మానేసి పదినెల్లుగా నీకు దూరంగా ఉన్న భార్యాపిల్లలను దగ్గరికి తీసుకొని సుఖంగా ఉండు; మా కోర్టులు కుటుంబాలను (దంపతులను) విడదీయడానికి లేవు. కలుపడానికి కూడా ఉన్నాయని గుర్తుపెట్టుకో' అన్నాడు కుటుంబ వ్యవహారాలు చూచే న్యాయమూర్తి పరమేశ్వర్‌తో.

గత పదిమాసాలుగా పరమేశ్వర్ గిరిజ వేరు వేరుగా ఉంటున్నారు. అందుకు ప్రధాన కారణం సుగుణసుందరి. ఈమె విశాఖలో భర్తను వదలివేసి ఇద్దరు పిల్లలతో హైదరాబాదుచేరి, ఓ ప్రైవేటు హాస్పిటల్లో నర్సుగా చేరి, హాస్పిటల్‌కు వచ్చిన పరమేశ్వర్‌తో పరిచయం పెంచుకొంది. పరమేశ్వర్ ప్రభుత్వోద్యోగి. ఆమె హాస్పిటల్‌లోనే గత పదిరోజులుగా ఓ మారుమూలగదిలో పిల్లలతో ఉంటున్నానన్నది. దుబాయికి వెళ్లిన తన మిత్రుని ఇల్లు ఖాళీగా ఉందని అందులో ఆమెను పిల్లలను చేర్పించి తనకంటే పదేళ్లు పెద్దదైన ఆమె ప్రేమలో పడిపోయాడు పరమేశ్వర్. ఏడాది తర్వాత ఈ విషయం తెలిసిన గిరిజ పరమేశ్వర్‌తో పేచీ పడింది. ఒకటిరెండుసార్లు సుగుణ సుందరి పిల్లలు మన ఇంటికి ఎందుకు వచ్చారని నిలదీసింది.

సరిగా పదినెలల క్రింద తమ ఇంటిముందు నుండి వెడుతున్న సుగుణ

సుందరిని లోనికి పిలిచింది గిరిజ. విషయం అర్థంగాక సుగుణ సుందరిలోనికి వచ్చింది. గిరిజ ఆమె సిగ అందుకొని ఈడ్చికొట్టింది. ఇద్దరూ కొట్టుకొన్నారు. రక్కుకొన్నారు; గిచ్చుకొన్నారు; కొరుక్కొన్నారు. పరమేశ్వర్ ఇంట్లో లేడు. అతని తల్లిఉంది. ఆమె మూలకున్న కట్టె తీసుకొని సుగుణసుందరిని నాలుగంటించింది. పనిలో పనిగా కోడలు గిరిజనూ రెండంటించింది. సుగుణసుందరి పారిపోయింది; అత్తగారు తనను కొట్టినందుకు నిరసనగా పిల్లవాణ్ణి తీసుకొని గిరిజ వెళ్లిపోయింది. "నేను కొట్టాలని కొట్టలేదే" అని అత్తమొత్తుకొన్నా గిరిజ వినలేదు.

ఆరోజే భర్త, అత్తా తనను మరింత కట్నం తెమ్మని హింసిస్తున్నారని పోలీస్ స్టేషన్ కెక్కింది గిరిజ. పోలీసులు హుటాహుటిన పరమేశ్వర్‌ను అతని తల్లిని అరెస్టు చేసి తెచ్చారు. కండకావరంతో ఇష్టం వచ్చినట్టు తిరుగుతావురా అంటూ నానాబూతులుతిట్టారు. పదోపాతికో వసూలు చేసుకొన్నారు. పరమేశ్వర్ మిత్రులు లాయర్‌ను సంప్రదించారు. బెయిల్ సంపాదించారు. లాయర్ విడాకులకేసుపెట్టారు. కేసు నడుస్తున్నది.

న్యాయమూర్తి గిరిజను, పరమేశ్వర్‌ను వేరువేరుగా పిలిచి విషయం తెలుసుకొన్నారు. సుగుణ సుందరి పూర్వాపరాలు వెలికి తీశారు. పరమేశ్వర్ విడాకులిస్తే, గిరిజే నష్టపోతుంది. అన్నిటికి మించి ఆ పిల్లవానికి తండ్రి ఆలనాపాలనా ఉండదు. గిరిజ ఎవరిమీదో పడి బ్రతకాల్సి వస్తుంది. పరమేశ్వర్ నెలకింత మనోవర్తిచెల్లిస్తాడు; చేతులు దులుపేసుకొంటాడు. అందుకే సుగుణసుందరి పూర్వాపరాలు గిరిజముందు ఏకరువుపెట్టి ఆమెను భర్తతోకలిసి ఉండడానికి అంగీకరింపజేశాడు.

ఆ తర్వాత పరమేశ్వర్‌ను ఒప్పించే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో భాగమేపై మాటలు.

'గిరిజ ఒప్పుకొంటే నాకేం అభ్యంతరం లేదు' అన్నాడు పరమేశ్వర్.

'ఆమె ఒప్పుకొన్నది'.. అంటూ పక్కగదిలోని గిరిజను పిలిచాడు న్యాయమూర్తి. గిరిజ వచ్చింది. న్యాయమూర్తికి పరమేశ్వర్‌కు మధ్యన నిలుచుంది.



'మీరిద్దరు కలిసి ఉండడానికి నిర్ణయించుకొన్నారు సంతోషం' అంటూ గిరిజా పరమేశ్వర్ల చేతులు కలిపి, మీరలా కూచొని మాటాలడుకోండి అని తాను ఫైళ్లలో తలదూర్చారు న్యాయమూర్తి.

గిరిజాపరమేశ్వర్లు గోడకు దగ్గరగా ఉన్న బెంచి మీద కూర్చున్నారు. తమ మాటలు ఎవరికి వినిపించనంత దూరంగా ఉన్నారు.

'ఈ పదినెలలు ఎంత అశాంతి, ఎంత ఖర్చు....' పరమేశ్వర్ అన్నాడు.

'బాబేడుస్తున్నాడు వాడికి సరిగా తిండికూడాలేదు....' ఏడ్చింది గిరిజ.

'నీవల్ల నాకు ఇరవైవేలు ఖర్చయినై' నిర్లిప్తంగా అన్నాడు పరమేశ్వర్.

'నీవు అలా తిరగడం వల్లనే ఇలా జరిగింది' ఎత్తిపొడిచింది గిరిజ.

'నేను తిరిగితే నేనేచెడిపోతాను; నీకేమవుతుంది' పరమేశ్వర్ ప్రశ్న.

'నా సంసారం పాడవుతుంది' గిరిజ జవాబు.

'మరి ఇప్పుడు భార్యభర్తలుగా మనం ఉండాలని ఎందుకని నిర్ణయించుకొన్నావు' పరమేశ్వర్ అడిగాడు.

'నా సంసారం నిలుపుకోవాలని; నాకొడుకుకు విద్యాబుద్దులు చెప్పించుకోవాలని; అన్నిటికి మించి నిన్ను కాపాడుకోవాలని....' గబగబా అన్నది గిరిజ.

'బిత్తరపోయి చూశాడు పరమేశ్వర్.

అవును.. ఈరోజు ఈ మేజిస్ట్రేట్ చెప్పారు. ఆమె కిరస్తానీగదా! ఈమెట్టుగడ్డ చర్చిలోని ఓ ఫాదర్‌తో మాటాడిందట. నిన్ను కిరస్తానీగా మార్చి తాను పెళ్లిచేసుకోడానికి ప్లాన్ వేసిందట. అంతేగాదు మీ అమ్మగారినీ మార్చేస్తుందట. నీ ఆస్తిని కాజేస్తుందట. మిమ్మల్ని మాయజేసి ఆస్తంతా తనపేర చేసుకోవాలని కూడా ఆలోచిస్తుందట. ఇప్పటికే ఆలస్యమైపోయింది. చేతులుకాలింతర్వాత ఆకులు పట్టుకొని లాభం లేదు. కలసి ఉండడానికి ఒప్పుకొమ్మన్నాడు. నేను

ఒప్పుకొన్నాను. నా భర్త తప్పు చేశాడు నిజమే. తప్పు చేస్తున్న వాళ్లెందరులేరు. అంతమాత్రాన్నే కావాల్సిన వారిని దూరం చేసుకొంటామా! దూరం చేసుకొంటే కోడిపిల్లను తన్నుకపోయే గద్దల్లా విదేశీ మతాలు కాచుకొనికూచున్నాయని అర్థమైంది... అందుకే లే పరమేశా! గంగవిడుము పార్వతి చాలున్ అంటున్నా" అన్నదిగిరిజ. పరమేశ్వర్ చేతిని తన చేతిలోకి తీసుకొంటూ.

ఇద్దరూ న్యాయమూర్తి దగ్గరికి వెళ్లి నమస్కరించారు.

'జగతః పితరౌవందే' అంటూ ఆయనా నమస్కరించారు.

